దేశీ ప్రచురణ
తృతీయ ముద్రణ
డిశంబరు '51
సర్వోదయ ప్రెస్
పటమట —
ముప్పాళ లా



సంపాదకులు
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# కాశీనాథ్

## ౧

తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేచి స్నానసంధ్యాదులైన తర్వాత, పూజా పునస్కారం ముగించి పిలక ముడి వేసుకొని పండిత ధనుంజయ భట్టాచార్యులుగారి పాఠశాల వరండాలో కూర్చుని గుణగుణాయిస్తూ దర్శన శాస్త్ర సూత్రాలు, భాష్యాలు వల్లిస్తుంటే కాశీనాథునికి బైటప్రపంచమే జ్ఞాపకముండేది కాదు. ఉన్నతమైన నుదురూ దీర్ఘాకృతిగల కాశీనాథుడు వంద్యోపాధ్యాయుని దర్శనశాస్త్ర గహన కాననంలో ప్రవేశించగానే పూర్తిగా దిగ్భ్రాంతుడై పోయాడు. ఈ స్థితిలో చూచి లోకులు అతన్ని గురించి పలువిధాలుగా చెప్పుకుంటూ వుండేవాళ్లు. తండ్రిలాగ విద్వాంసు డౌతాడనుకొనేవాళ్లు కొందరు ఇట్లాగే చదువుతూ చదువుతూ పిచ్చివాడై పోతాడేమోనని శంకించేవాళ్లు మరి కొందరు. పిచ్చివాడై పోతాడని శంకించేవాళ్లలో అతని మామకూడ ఒకడు. "అరే, నువ్వు స్థితిపరుడవు కాదుగదా! యింత చదివేం చేస్తావు? చదివింది చాలదా ఏమిటి, నీపొట్ట పోసుకోటానికి? చదివి, చదివి ఆఖరికి నువ్వుకూడా చచ్చి యేలోకాన వున్నాడో వంద్యోపాధ్యాయునిలాగ ఇంట్లో ఒక మూల కూర్చుని బుర్ర వూగిస్తు వుంటావా ఏమిటి? ఇప్పుడున్న ఆశ కాస్తా పోతుంది" అని మధ్యమధ్య హెచ్చరిస్తూ వుండేవాడు.

మామగారి ఈ హెచ్చరిక ఈ చెవిలోంచి ప్రవేశించి ఆ చెవిగుండా బైటికిపోతూ వుండేది.

పిచ్చివాడై పోతాడనే భయంతో మామ అతన్ని గదురుకొంటూ వుండేవాడు. ఇంటి పనిపాటల్లో తోడురాడని అత్త విదిలిస్తూ వుండేది. వ్యాకరణ సాహిత్యాల్లో పుట్టిన జంతువనుకొని అతనికన్న వయస్సులో పెద్దవాడైన మామ కొడుకు ఎగతాళి చేస్తూవుండేవాడు. కాని కాశీనాథుడు వీటి నన్నిటినీ ధైర్యంతో సహిస్తూ లెఖచేసేవాడుకాదు.

ఎవరెంత చేసినా అతని కార్యక్రమంలో మాత్రం కించిత్తయినా మార్పు వచ్చేదికాదు. సాయంత్రం తోటల్లో తనయిష్టం వచ్చినట్టు తిరుగుతూనో, లేకపోతే ఏటివొడ్డున ఆపెద్ద మరిచెట్టు క్రింద కూర్చుని అస్తమించబోతున్న సూర్యుని అరుణ కాంతులు ఆకాశంలో ఎట్లా విలీనమౌతున్నయో చూస్తూనో వుండేవాడు. ఒక్కొక్కప్పుడు ఆవూరి జమీందారుగారి శివాలయానికి పోయి అర్ధనిమీలిత నేత్రాలతో స్వామిని ధ్యానిస్తూ వుండేవాడు. లేకపోతే మామగారి చండీమండపం మీద గొంగళి పరుచుకొని చీకట్లో మౌనంగా కూర్చుని వుండేవాడు.

ఇంతకుతప్ప ప్రపంచములో అతనికి మరొక పనిగాని, మరొక కోర్కెగాని, మరొక ఉద్దేశముగాని లేదు. పన్నెండేళ్ళ ప్రాయంలోనే అతని తండ్రిపోయాడు. ఈ ఆరేళ్ళనుంచీ అతను మామగారింటి వద్ద ఇలాగే గడిపాడు. ఇప్పుడేం చేస్తున్నాడో, ముందేం చెయ్యబోతాడో, ఇదివరలో ఏం చేశాడో, ఏంచేసే అవసరముందో ఈ విషయాలేమీ అతని

మనసుకి తట్టవు. అతను ఎప్పుడూ జీవితమంతా యిలాగే గడుపుతూ - మామగారింటివద్ద రెండు పూటలూ పుష్టిగా భోంచేసి-విదిలింపులు సదిలింపులూ తింటూ వుంటాడు. కాని ఇంకెక్కడికైనా వెళ్ళిఏమైనా చేయటానికి ప్రయత్నించడు. ఆ అంధకారాన్ని దాటి బైటి వెలుగులోకి రావాలని వుద్దేశంకూడా అతనికి లేదు. ఇరుగు పొరుగు వాళ్లెవరైనా దయతలచి, పిలిచి - "కాశీనాథ్ ! ఇట్లా గడిచినవాళ్లెవరూ లేరు. నీకూ అంతే ఏదైనా చేస్తూవుండు" అని చెబుతూ వుండే వాళ్లు. కాశీనాథుడు దానికేమీసమాధానమిచ్చేవాడు కాదు. నే నేమిచేస్తున్నా నా, ఇంకేమిచెయ్యాలా అని ఆలోచించుకునే వాడు. ఈవిధంగా కాశీనాథునికి రోజులు గడుస్తున్నవి.

౨

ఆవూరి జమీందారుపేరు ప్రియనాథ ముఖోపాధ్యాయుడు. ప్రియనాథుడు కులీనుడు, అతిశయ ధనసంపన్నుడూను. కుల మర్యాదల్నిరక్షించటానికి పేరుపొందిన తను ఎంతగాలించినా సర్వగుణ సౌందర్య సంపన్నుడైన వరుడు దొరక్కపోయే టప్పటికి ఈ కులీనతా సాంప్రదాయంమీద అతనికి విసుగు కలిగింది. ఈ విషయం ఎప్పుడైనా భార్యతో అంటే, ఆమె "ఒక్కగా నొక్క కూతురుకదా కులీనతను ఏమిచేసుకుం టాం !" అనేది.

వారి కులగురువులు ఆవూళ్లోనే ఉంటుండేవారు, ఈవిషయం ఒకరోజున వారితో చెప్పేటప్పటికి - "హరి ! హరి ! అదెలాసాధ్యమౌతుంది! మీకు ధనధాన్యాల కేమి

కొదువలేదు. ఆస్తిపాస్తులు లేకపోయినా కులీనుణ్ని చూచి కన్యాదానం చేసి యింట్లోవుంచుకుంటే అన్నివిధాలా బాగుంటుంది. ఇంత పెద్ద వంశం, ఇంత ఉన్నతకుల మర్యాదలకి లోటు రానివ్వటం మాకేం బాగుండలేదు." అన్నారు. ఇంటికి వచ్చి ప్రియనాథ బాబు ఈవిషయం భార్యతో చెప్పేప్పటికి సంతోషంతో ఆమె "అలాగే చెయ్యండి! నేను బ్రతికినంత కాలం కమల కళ్ళముందైనా పడి వుంటుంది." అని తన అంగీకారాన్ని తెలియజేసింది.

అంతే జరిగింది. లేనివాడైనా కూతుర్ని కులీనున కిచ్చి పెళ్ళిచేసి అల్లుణ్ని యింట్లో వుంచుకోవాలనుకున్న తలంపు ధృవపరచుకొని ఒకనాడు ప్రియనాథబాబు మధుసూదన ముఖోపాధ్యాయులుగారింటికి వచ్చాడు. ముఖోపాధ్యాయుడు ఎక్కడికో పూజచేయించబోతూ ఇంత పెద్దెత్తుగల జమీందారు తలవని తలంపుగా తనింటికి రావటం చూచి చాల సందేహంలో ఎక్కడ కూర్చోబెట్టటమూ, ఎల్లా మర్యాద చెయ్యడమూ అనేది అతనికి తోచలేదు. మధుసూధనుడు సంకోచపడుతున్నాడని తెలుసుకుని ప్రియనాథబాబు నవ్వుతూ "మీతో కొంచెం పనుంది. పదండి లోపలికి వెళ్ళికూర్చుందాం" అన్నాడు.

"దయచేయండి ; కాని—"

"కాని గీని ఏమీలేదు. పదండి, కూర్చుని సావకాశంగా సంగతంతా చెబుతాను."

వెళ్లి ఇద్దరూ చండీమండపంమీద కూర్చున్నారు. "మీ మేనల్లుడెక్కడున్నాడు?"—ప్రియనాథబాబు అడిగాడు.

"ఇంకెక్కడుంటాడు? భట్టాచార్యులుగారి పాఠశాలలో చదువుతున్నాడు."

"కొంచెం పిలువనంపండి అతన్ని."

"పిలువనంపుతాను. అవసరమైన పనేమైనా వుందా?"

"అవును. అవసరమైన పనేవుంది."

ఆ అకర్మణ్యుడితో యింత పెద్ద జమీందారుకు అవసరమైన పనేమిటో అతనికి- అర్థంకాలేదు. కాని కొంచెం సంశయిస్తూ అడిగాడు "ఏమైనా తప్పుచేశాడా?"

"తప్పేం చేస్తాడు?"

"అయితే?—"

ప్రియనాథబాబు నవ్వి "అతనికి మా అమ్మాయిని యిచ్చి వివాహం చెయ్యడానికి నిశ్చయించుకున్నాను. ఈ వరుసలో మీరు నాకు బంధువులౌతారు." అని పకపక నవ్వసాగాడు. ఆశ్చర్యంతో మధుసూధనుడు కళ్లప్పళించుకుని అతని మొహంకేసి చూడసాగాడు. కొంచెంసేపుండి "ఎవరికి? కాశీనాథునికా?" అన్నాడు.

"అవును."

"ఎందుకని?"

"ఇటువంటి కులీనుడు నాకు ఎక్కడ వెతికినా కనబడలేదు. దీంతో మీకేమైనా ఆటంకం వుందా?"

"ఆటంకం? ఇది నాకు పరమసౌభాగ్యం. కాని వాడు పిచ్చివాడే?"

"పిచ్చివాడా? నే నెప్పుడూ వినలేదే?"

"వాడి తండ్రి పిచ్చివాడు."

ప్రియబాబు కాశీనాథుని తండ్రిని బాగా యెరుగు. చాల మంది అతన్ని పిచ్చివాడనుకునేది కూడా అతనికి బాగా తెలుసు. ప్రియబాబు కొంచెంసేపు ఆలోచించి అన్నాడు. "కుర్రవాడి పేరేమిటి?"

"కాశీనాథ వంద్యోపాధ్యాయుడు."

కాశీనాథుణ్ణి పిల్చుకు రమ్మని మధుసూధనుడు తన చిన్న కొడుకుని పంపాడు. వాడు వెళ్లి "కాశీబావా!" అని పిల్చేప్పటికి కాశీనాథుడు తలెత్తి చూచి "ఏమిటి?" అన్నాడు.

"నాన్నగారు నిన్ను పిల్చుకు రమ్మన్నారు."

"ఎందుకు?"

"ఎందుకో నాకు తెలియదు. జమీందారుగారు వచ్చారు. ఆయనే నిన్ను పిలువ నంపమన్నారు."

కాశీనాథుడు మెల్లగా పుస్తకంమూసి లేచివచ్చాడు. వచ్చి వారిముందు కుర్చున్నాడు. ప్రియబాబు అతన్ని ఆపాద మస్తకం నిరీక్షించి– "ఎక్కడున్నావ్ కాశీనాథ్?" అన్నాడు.

"భట్టాచార్యులుగారి పాఠశాలలో చదువుతున్నాను."

"వ్యాకరణం చదివావా?"

కాశీనాథుడు తల ఆడించి సమాధానమిచ్చాడు –

"చదివాను"

"సాహిత్యం చదివావా?"

"కొంతవరకు చదివాను"

"ఇప్పుడేం చదువుతున్నావు?"

"దర్శనశాస్త్రం"

"సరే- వెళ్ళి చదువుకో" అన్నాడు ప్రియబాబు.

కాశీనాథుడు వెళ్ళిపోయాడు. ఎందుకు రమ్మన్నారో, ఎందుకు వెళ్ళమన్నారో అతని కేమీ అర్థంకాలేదు. పాఠశాలకువచ్చి కూర్చుని మళ్ళీపుస్తకం తెరచాడు. అతను వెళ్లిపోయిన తర్వాత ప్రియబాబు "ఏమిటి మీరు ఇందాక పిచ్చివాడంటున్నారే" అన్నాడు.

"పిచ్చివాడేమి కాదుగాని. అదేదో ఒకవిధమైన వింత ధోరణి గల మనిషి. దీన్నిబట్టి అతన్ని కొందరు పిచ్చివాడని కూడా అంటూ వుంటారు" అన్నాడు మధుసూధనుడు.

"అదేమిటి?"

"ఎప్పుడూ పుస్తకం పుచ్చుకునో, లేకపోతే తన మనసొచ్చినట్లు గాలిగా తిరుగుతూనో వుంటాడు. ఇంకేపని లోనూ, విషయంలోనూ అతనికి ప్రమేయమే వుండదు. ఇదే ధోరణి?"

"ఇంకేమైనా చేస్తాడా?"

ఒక్కొక్కప్పుడు ఇంటో మూల - చీకట్లో - గంటల కొద్దీ ఒంటరిగా మెదలకుండా కూర్చుంటూవుంటాడు.

"ఇంకేమైనా -?" ప్రియబాబు నవ్వుతూ అన్నాడు.

అతని నవ్వులోని అర్థగాంభీర్యాన్ని తెలుసుకున్నట్టు మధుసూధనుడు కొంచెం తటపటాయించి. "ఇంకేం లేదు" అన్నాడు.

"అయితే లోపల వాళ్ళ అడగండి, వారికు కూడా యిష్టమైతే వివాహం ఈ నెలలోనే చెయ్యాలని వుంది."

ఇంట్లోకి వెళ్ళి అయ్యవారు భార్యతో ఈవిషయ మంతా చెప్పేసరికి ఆమెకు ఒక్కసారి ఆకాశాన్నుంచి ద్రొళ్ళి నట్లయింది. మళ్ళా మనసు కొంచెం కుదుటపడిన తర్వాత "కాశీకి ప్రియబాబు కుమార్తెను యివ్వటమా ? మీకు మతి పోయిందా ఏమిటి?" అన్నది.

"దీన్లో మతిపోయే దేముంది?"

"మరి, కాకపోతే –"

"కాశీనాథుడు ఎంత కులీనుడో కొంచెం ఆలో చించుకో."

"ఆ భాగ్యం మన హరికి కలగ్గూడదు" అన్నది భార్య ఒక్క దీర్ఘ నిశ్వాసం విడిచి.

ఇది అసంభవమని యిద్దరికీ తెలుసు. "నీ వుద్దేశ మేమిటే?" పంతులు నిట్టూర్చి అడిగాడు.

"ఉద్దేశ మేముంది, నాపిండాకూడు? పెళ్ళి చెయ్యండి" అన్నది భార్య విషాద స్వరంతో.

పంతులు బైటికివచ్చి – లేనిచిరునవ్వు మోహం మీదికి తెచ్చిపెట్టుకుంటూ – "ఇంట్లోవాళ్ళ ఆనందానికి అంతులేదండి. నేటివరకు ఆవిడే తల్లిలాగ వాణ్ణి సాకుతూ వచ్చింది. కాశీనాథుడికి రెండేళ్ళయినా నిండకముందే మా తోబుట్టు కాలంచేసింది. అప్పటినుండి ఆవిడే ఒకవిధంగా వాణ్ణి పెంచి పోషించి యింతవాణ్ణి చేసింది. ఇక తర్వాత బావగారు పోయినదగ్గరనుంచీ వాడు మాయింటివద్ద వుంటు న్నాడు" అన్నాడు.

"అవును! అదంతా నాకు తెలుసు, అయితే ఇవ్వాళే అంతా ఖాయపర్చండి" అన్నాడు ప్రియబాబు.

"ఇంకా ఖాయపర్చేదేముంది? మీాకు వీలుగా వున్న నాడే - నేనూ దీవించి అక్షతలు వేసివస్తాను."

"అదిగాదు. నా వుద్దేశం..."

"నేనింకా వేరే ఖాయపర్చేదేముంది? మీాయిష్టం వచ్చినట్లే కానియ్యండి. అయినా వాడి అత్తతో ఒకవిధంగా తల్లిలాగ సాకిందామెను - కొంచెం సంప్రదిస్తే బాగుంటుం దనుకుంటాను."

"అవును, తప్పకుండా. అదే నేనూ అనేది." తర్వాత కాశీ అత్తగారి అంగీకారంతో - ప్రియబాబు యిష్టప్రకారం సంబంధం ఖాయపర్చుకున్నారు. తలిస్థానంలో నున్న వియ్యపురాలు వెయ్యిరూపాయలిస్తేగాని కాశీవివాహం జరగడానికి వీలుకాదంది. ప్రియబాబు దీని కేమి కాదనలేదు.

## 3

మొదట ఏది ఎలా వున్నా, జమీాందారుగారి యింటి అల్లుడై వచ్చిన తర్వాత మాత్రం కాశీనాథునికి మానసికంగా సుఖమేమీా కనిపించలేదు. ఇప్పుడు తనువెళ్ళాలనుకున్న చోటికి వెళ్ళలేక పోతున్నాడు. నుంచోవాలన్నచోట నుంచోలేక పోతున్నాడు. ప్రకృతంతా అతనికి విరుద్ధమైనట్లు కనబడుతోంది. అతను ఎక్కడికైనా వెళ్ళాలనుకుంటే మామగారి అనుమతి దొరికేదికాదు. అథవా ఒకవేళ దొరికినా అత్తగారు వెనుకనుంచి విసుక్కుంటూ

మా అల్లుడేమిటీ, వారియింటి కెళ్ళడమేమిటీ, అని సణుక్కో-నేది. ఇక దానితో అతనికి ముందుకు అడుగు పడేదికాదు. అలా ఎందుకు జరుగుతూవుందో - తన్ను ఈవిధంగా ఎందుకు అదుపులో వుంచుతున్నారో-అలా వుంచడంలో వారి వుద్దేశ మేమిటో-అతని కేమీా అర్థంకావటం లేదు. అప్పుడప్పుడు-నేను సామాన్యపు మనిషినా ఏమిటి ఎక్కడికిబడితే అక్కడికి తిరగ టానికి-అని తృప్తిపడుతూ వుండేవాడు. కాని లోపలనుండి అతని ఆత్మ - "శాంతిలేదు, విశ్రాంతిలేదు. స్వాతంత్ర్యం లేదు" అని పరితపిస్తూ వుండేది.

ఇదివరకు గహనకాననాల్లో చిత్తమొచ్చినట్లు విహ రిస్తూ వుండేవాణ్ణి, ఇప్పుడు స్వర్ణపంజరాల్లో పడివుండాల్సి వచ్చిందని అతనికి అవగాహన కాసాగింది. ఇదివరకు అతను విశాల సముద్రంలో ఈదులాడుతూ వుండేవాడు. కాని యిప్పుడు నలు వైపులా ఎత్తనగట్లతో సీమితమైన పుష్ప కొలనులలో తచ్చట్లాడాల్సి వచ్చింది. సముద్రంలో హాయిగా విహరిస్తూ వుండేవాడని కాదు-అక్కడకూడా అతను బీభత్స తుపానులనూ, భయంకర తరంగాలనూ ఎదుర్కోవల్సివచ్చేది. కాని ఈ నిర్మల సరోవరంలో అంతకంటే కష్టతరంగా, ఒక్కొక్కప్పుడు సలసల మసులుతున్న నూనెలో పడేసినట్టు వుంటోంది. అందరూ కుమ్మక్కు చేసి అతని దేహాన్ని కొనేసి నట్టుంది. ఇప్పుడది తనది కాదు. తలమీద ఆ పిలక లేదు. మెళ్ళో ఆ రుద్రాక్షమాల లేదు, ముఖాన విభూదిరేఖలు లేవు, బిళ్ళగోచీ లేదు, ధనంజయభట్టాచార్యుని పాఠశాల లేదు.

ఏటిఒడ్డున ఆ మర్రిచెట్లు లేవు. ఆ చండీమండపం లేదు. ఏమీ లేదు. సర్వం శూన్యం !

అతనికి మరో క్రొత్త జన్మమెత్తి పూర్వజన్మ స్మృతులన్నిటినీ మరచినట్లయింది. లేకపోతే అతని దేహమూ, మనస్సూ గుద్దులాడుకుని విడిపోయున్నావుండాలి. సాయంత్రం కాగానే అతని మనస్సు నది ఒడ్డున మర్రిచెట్టు దగ్గరో, పొలాల్లోనో గాలిస్తూవుంటే, శరీరం హంసతూలికా తల్పంమీద నిర్జీవంగా పడివుండేది. మనస్సు అంగవస్త్రం కట్టుకుని ఏటిలో దూకి జలకాలాడుతూంటే, శరీరం ముక్కాలిపీటమీద కూర్చుని నౌకర్లతో శిరస్నానం చేయించుకుంటూ వుండేది. ఈవిధంగా ఒక్క కాశీనాథుడు ఎప్పుడూ రెండుచోట్ల రెండు పనులు చేస్తూవుండేవాడు. అయినా అవేవీ అతనికి సుఖంగానూ, సంతృప్తిగానూ వుండేవి కావు.

ఈవిధంగా ఎంతో కాలం గడచిపోయింది. ఒక్కొక్కటిగా అత్తవారింటిపద్ద పన్నెండు మాసాలుదాటి పోయినాయి. మొదట క్రొత్తబులపాటంలో కొన్ని నెలలపాటు కాశీనాథుడికి తనలోని గుణదోషాలను వెతుక్కునేంత అవకాశం దొరక్కపోయింది. కాని సమయమొచ్చి చూచేప్పటికి రోజురోజుకి తగ్గిపోసాగాడు. ఈ సంగతి ఎవరైనా తెలుసుకున్నారో లేదోగాని కమలమాత్రం కనిపెట్టింది. ఆమె కళ్లు భర్తసితిని గుర్తించాయి. ఒకరోజున ఆమెఅడిగింది. "మీరు రోజురోజుకీ చిక్కిపోతున్నారెందుచేత ?"

"ఎవరంటారు?"

"నాకళ్లు చెబుతున్నాయి"

"పొరపడుతున్నాయి"

కమల వదిలిపెట్టలేదు–"ఎందుకనో నాకు చెప్పరా?"

"ఏమీ లేంది ఏం చెప్పను!"

"ఉంది"

"లేదు"

"తప్పకుండా ఏదో వుంది. నా మనస్సు చెబుతూంది"

కాశీనాథుడు మొహంతిప్పకొని– "నువ్వునన్ను చాలా వేధిస్తున్నావు. ఇక్కడనుంచి వెళ్లిపోతాను" అన్నాడు.

కాశీనాథుడు వెళ్ళబోయేప్పటికి కమల అతనిచెయ్యి పట్టుకుని – "వెళ్లబోకండి. ఇకనుంచి మిమ్మల్ని నేనేమీ అడగనులే" అన్నది విచారంతో.

కాశీనాథుడు ఒక్కక్షణం కూర్చుని మరుక్షణమే తటాలున లేచి వెళ్ళిపోయాడు. కమల అతన్ని ఈసారి కూర్చోమనలేదు. భర్త ఈవిధంగా వెళ్ళినమీదట ఆమె దిండులో మొహందూర్చి ఏడవసాగింది.

బైటికొచ్చి పార జూచేప్పటికి కాశీనాథునికి ఎవరూ కన్పించలేదు. మెల్లగా గడపదాటి కొంచెంకాలుసాగించాడు. చాలా దూరం వచ్చి వెనక్కి తిరిగి చూచేప్పటికి – వెనక నౌకరు కూడా వస్తున్నాడు. అతను విసుక్కుంటూ నుంచుని – "ఎక్కడికిరా, ఇట్లావస్తావు?" అన్నాడు.

నౌకరు దణ్ణంపెట్టి – "తమవెంట –"అన్నాడు.

"నావెంట వచ్చే అవసరమేమీ లేదు తిరిగిపో"

"సాయంత్రం తమరు వొంట్రిగానే తిరిగొస్తారా?"

దీని కేమీ సమాధాన మివ్వకుండా కాశీనాథుడు వెళ్ళసాగేడు. పాపం నౌకరుకి ఆ సమయంలో ఏమి చెయ్యాటానికీ తోచలేదు. కొంచెంసేపు నుంచుని ఆలోచించి 'తిరిగి వెళ్ళవలసిందే, నని నిశ్చయించుకున్నాడు. కాశీనాథుడు మాత్రం అతన్నిగురించి అట్టే అలోచించకుండా తిన్నగా మేనమామగారింటి కెళ్ళి శూన్యహృదయంతో లోపలి వరండాలో కూర్చున్నాడు. కొంచెంసేపువున్న తర్వాత హరిబాబు బైటికి వెళ్ళుతూ అతన్ని చూచాడు. కాని కొంచెం కనుచీకటిగా వుండటం మూలాన గుర్తించలేక దగ్గరకువెళ్ళి – ఎవరువారు?' అన్నాడు.

"నేనే"

"పిల్లజమీందారువారా! ఇక్కడికి ఎలావచ్చారు?" అన్నాడు. హరికి చాల ఆశ్చర్యం కలిగింది.

కాశీనాథుడు మాట్లాడలేదు! "అమ్మా! జమీందారుగారి అల్లుడువస్తే కూర్చోటానికి ఎవరూ పీటకూడా వెయ్యలేదేమే"—హరిబాబు గల్లంతుచేస్తూ అన్నాడు.

హరితల్లి పరుగెత్తుకుంటూ వచ్చి – "మీ అత్త జ్ఞాపకమొచ్చిందా నాయనా?" అన్నది.

కాశీనాథుడు ఈసారికూడా ఏమిమాట్లాడలేదు. మళ్ళా, అత్త కూతురు బిందువాసినిని పిల్చి–' బిందూ,త్వరగా రా, చూడు మన కాశీబావొచ్చాడు. కూర్చోటానికి ఏదైనాతీసుకురా. ఇంతలో నేను సంధ్యాపూజ ముగించి వస్తాను" అన్నది.

బిందువాసిని మధుసూధన భట్టాచార్యుని చిన్న కూతురు. పెద్దింటి కోడలవటం మూలాన ఆమె పుట్టింటికి తరచుగా రాదు. ఆమె వచ్చి ఇప్పటికి నెలరోజులైనా కాశీ బావను మాత్రం చూడలేదు. కాశీబావంటే ఆమెకు అతి మక్కువ, అందుకనే అతనిపేరు వినగానే పరుగెత్తుకువచ్చి చూచేప్పటికి ఎవరూ కనబడలేదు. చీకటి వరండాలో మాత్రం ఒక రాచబిడ్డ కూర్చొని వున్నాడు. అటువంటి కాశీ బావను ఆమె అదివర కెన్నడూచూడలేదు. ఇప్పుడు కాశీ బావజమీందారుగారిఅల్లుడై-ఈరాజవేషంలో చూచినప్పుడు ఆమెకు చాల నవ్వువచ్చింది. కాని, దగ్గరకెళ్ళి చీకటిలో మలినమై వాడిపోయిన బావగారిమోహం చూచేప్పటికి ఆమె నవ్వు ఎగిరిపోయింది. కాశీనాథుని మొహం ఇట్లా చింతతో వాడిపోయి వుండటం ఇదివర కెన్నడూ చూడలేదు. ముఖ్యంగా బిందు-ఇంటిల్లిపాతిలో ఆమె ఒకతెమాత్రమే తన కాశీబావను గుర్తించగలిగేది. ఆమె దగ్గరకువెళ్ళి వీపుమీద చెయ్యేసి స్నేహంతో - "బావా, ఇక్కడ చీకట్లో ఒక్కడివీ ఎందుకు? పద, లోపలికి వెళ్ళి కూర్చుందాం" అన్నది. కాశీనాథుడు మెదలకుండా లేచి వెళ్లి ఇంట్లో మంచంమీద కూర్చున్నాడు.

"నేనిక్కడికి వచ్చి ఎన్నాళ్ళ"యింది బావా, ఒక్క నాడైనా నన్ను చూట్టానికి వచ్చావు?" అన్నది బిందు.

"రాలేకపోయా నమ్మా!"

కాశీనాథుడు కొంచెం తడబడుతూ అన్నాడు - "రానివ్వటంలేదు."

"రానివ్వటం లేదా? ఎందు కని?"

"ఏమో - వాళ్ళయిష్టం"- కాశీనాథుడు అన్యమనస్కంగా అన్నాడు. "నువ్వు వెళ్లాలనుకున్న చోటికి వెళ్ళనివ్వరా ?"-బిందు దుఃఖంతో అడిగింది.

"లేదు వెళ్ళనివ్వరు. నేనెక్కడకన్నా వెళితే మామగార్కి అవమానం కలుగుతుందట."

ఈ మాటలమూలాన బావకు కష్టం కలుగుతోందని బిందు తెలుసుకొని ధోరణిమార్చి - "బావా అక్కను చూపించవూ?" అన్నది.

కాశీనాథుడు మాట్లాడ లేదు.

"ఎలావుంటుంది?"-బిందు మళ్ళీ అడిగింది.

"బాగానే వుంటుంది"

"అయితే ఒక రోజున నేను చూచిరానా ?"

కాశీనాథుడు తలెత్తి బిందు మొహంవంక చూచి "చూచిరా" అన్నాడు నవ్వి.

ఇంతలో బైట బండిచప్పుడు వినపడింది. "మీా బండి వచ్చినట్టుంది" - బిందు అన్నది.

"అవును అల్లాగే వుంది"

వెళ్ళేప్పుడు అతను అడిగాడు - "ఎప్పుడు వస్తావు"

"మీా అక్కను చూట్టానికి-"

బిందు చిరునవ్వుతో - "నీకు ఎప్పుడు తీరికుంటే అప్పుడే వచ్చి తీసికెళ్ళు?"

"రేపు రానా?"

"రా"

మర్నాడు కాశీనాథుడు స్వయంగా బండి తీసుకు వచ్చాడు. బిందు వెళ్ళబోయే సమయానికి హరిబాబు ఎక్కడనుంచో యింటికి వచ్చాడు. వస్తూనే వాకిట్లో బండి నిలబడి వుండటం చూచి కాశీనాథుడు వచ్చాడేమోనని అనుమానపడ్డాడు. అతను లోపలికి రాగానే "బిందు వెళు తోంది ఎక్కడికి?" అని తల్లిని అడిగాడు. "అక్కనుచూచి వస్తుందటరా!" అన్నది తల్లి.

"ఏ అక్కని! జమీందారుగారి అమ్మాయినా!"

తల్లి ఏమీ జవాబు చెప్పలేదు.

హరిబాబు గంభీరంగా "బిందు అక్కడికి వెళ్ళిం దంటే ఇక నేను బ్రతికున్నంతవరకు దాని ముఖం చూడను—" అన్నాడు.

"బావ భార్యను చూట్టానికి వెళుతోంది. దీనిలో తప్పేముందిరా!" తల్లి ఆశ్చర్యంతో అడిగింది.

"మంచీ చెడా చెప్పటానికి నాకిప్పుడు తీరిక లేదు. బిందు నామాట వినకపోయిందంటే దాన్ని మళ్ళీ ఈయింట్లో అడుగు పెట్టనియ్యను."

హరి ఎటువంటి స్వభావం కలవాడో బిందుకు తెలి యని విషయం కాదు. ఆమె మెదలకుండా మూట ముల్లె దింపుకుని ఇంట్లోకి వచ్చింది. కాశీనాథుడు నుంచుని జరిగిందంతా చూస్తూ ముఖం ఇంతచేసుకొని బండి త్రిప్పుకొని వెళ్ళి పోయాడు.

"బిందు రాలేదేం!" అని నారాయణపురం జమీందారు

"వారు పంపలేదు" — కాశీనాథుడు విచారంగా అన్నాడు.

"ఎందుకని?"

"తెలియదు. ఇక్కడికి పంపటానికి వారికి సిగ్గయింది కాబోలును."

ఆమాట కమల హృదయంలో నాటుకు పోయింది.

## ४

ప్రియబాలుజమీందారుకి కమల ఒక్కగా నొక్క కూతురు. అతను మొదట మరి రెండు పెళ్ళిళ్ళు చేసు కున్నాడు గాని, వాటివల్ల అతనికి సంతానప్రాప్తేమీ కలుగ లేదు. భార్య లిద్దరూ పోయారనే మానసిక దుఃఖంతో- వృద్ధాప్యంలో అతను మూడో వివాహం చేసుకున్నాడు. దాని ఫలస్వరూపమే ఈ కన్యారత్నం! సంతానహీనులకి సంతానం కలిగేప్పటికి, ఆడ, మగ భేదమంటూ వుండదు. అందుకని కమల ఇంట్లో యజమానులకు యజమానిగాను, యజమానురాం డ్రకు యజమానురాలుగానూ వుంటోంది. ఇంట్లో ఎవరికీ కూడా ఆమె మాటను తోసెయ్యటానికి గానీ, ఆమె కోర్కెకు విరుద్ధంగా నడవటానికీగానీ సాహసం లేదు. కమల ధన వతి, గుణవతి, విద్యావతి, రూపవతి. అన్ని విషయాలలోనూ ఆమెకు ఏకాధిపత్యం వుంది. అయినా కూడ ఒక మనిషిని మాత్రం ఆమె ఏవిధంగాగూడా తనవశపర్చుకోలేక పోతోంది. అతనే - ఆమె భర్త! కమల అనేక వుపాయాలు చేసి చూచింది - బెదిరించి చూచింది, కోపగించి చూచింది

విలపించిచూచింది, శుశ్రూష చేసిచూచింది. కాని ఏ విధానా గూడా భర్తమనస్సును స్వాధీనపర్చుకోలేక పోయింది. స్వాధీన పర్చుకోవడం అటుంచి ఆఖరికి అతని చెంత కూడా చేరలేకపోయింది. ఒక పేద ఎంతఉన్నత మైన మనస్సుతో తన భర్తయి వచ్చాడోకూడ ఆమె నిర్ణయించలేక పోయింది. కమల నిత్యం రెండుపూటలూ "భగవంతుడా! వారిమనస్సు నాకివ్వగూడదు" అని ప్రార్థించేది. అప్పుడప్పుడూ వారికి మనస్సనేదే లేదేమో, అందు కనే పొందలేక పోతున్నానేమోనని సందేహపడుతూ వుండేది కూడా. కమలకు తనభర్త ఒక జటిల రహస్య మయరూపుడై పోయాడు. రోజులు గడచినకొద్దీ అతని కనుగొనేమార్గం మరింత జటిలమవ్వసాగింది. ఒక్కొక్క ప్పుడు తన భర్త ప్రేమిస్తున్నట్లు ఇంకెవరి భర్తలూ కూడా ప్రేమించటం లేదనుకొనేది. కాని తనభర్త ఉపేక్షిస్తున్నట్లు మాత్రం ఇంకెవరిభర్తలూ ఉపేక్షిస్తూ వుండరేమోనని ఒక్కొక్కప్పుడు అనుకొనేది. అయినా కమలకు కాలం గడచిపోతూనేవున్నది. గడనంది కాశీనాథునికే! అతనికి పుస్తకాలమీద మనస్సుండటంలేదు. ఊరికే కూర్చొ టానికీ తోచటంలేదు. మాటామంతి హాస పరిహాసాల్లో అతనికి రుచిపోయింది. కండలు తిరిగిన అతని శరీరం కృశించ సాగింది. పచ్చటిరంగు నల్లబడిపోయింది. భర్త రోజురోజుకీ ఇట్లా కృశించిపోవటం చూచి కమల నెత్తినోరు కొట్టుకొని ఏడ్చేది. ఈవిషయంలో అతన్నింకెప్పుడూ అడగవద్దనే ప్రతిజ్ఞయితే చేసికొంది. కాని ఆ ప్రతిజ్ఞను ఆమె

పాటించలేకపోయింది. ఒకరోజున భర్త వచ్చేప్పటికి అతని పాదాలమీద పడి ఏడ్చింది. ఆతురతపడి కాశీనాథుడు ఆమెను లేవదీయాలని ప్రయత్నించాడు గాని లేవదీయలేకపోయాడు.

"ఏమి జరిగింది, ఏడుస్తున్నావెందుకు ?"

కమల సమాధాన మేమీ ఇవ్వలేదు. చాలసేపు ఏడ్చి మళ్ళా అతని పాదాలమీద పడి "నన్ను మీరు చంపేయదలిస్తే ఒకసారి చంపేయండి కాని ఈ విధంగా మాత్రం హింసించకండి" అన్నది.

కాశీనాథుడు చాల ఆశ్చర్యపడ్డాడు. "ఏమిటి? చెప్పు నేనేం చేశాను?" అన్నాడు.

"అదేమిటో మీకు తెలియదా?"

"మీ యిష్టంవచ్చినట్టు చెయ్యండి, కాని నేను నుంచోటానికిమాత్రం కొంచెం ఎంచ వుంచండి. ఇంకేమీ మిమ్మల్ని నేను అడగను."

ఈసారి కాశీనాథుడు కమలను లేవదీసి చెంతకు గోర్చి బెట్టుకుని, చాలా ప్రేమతో బుజ్జగిస్తూ అడిగాడు - "అసలు ఏమి జరిగిందో నాకు సరిగా చెప్పు"

"మీరు రోజరోజుకీ అల్లా అయిపోతున్నారెందుకని?"

"నా శరీరం అంత క్షీణించిపోయిందా ఏమిటి?"

కమల పైటచెంగుతో మొహం కప్పుకుని ఏడుస్తూనే తల వూపింది—"చాలా తగ్గిపోయారు."

"అది నాకూ తెలుసు, కాని ఏమి చెయ్యమంటావు నువ్వే చెప్పు?"

కమల మొహం ఎత్తి—"మందు తీసుంటి" అన్నది.

"మందువల్ల నయమవుతుందా?" కాశీనాథుడు నవ్వుతూ అన్నాడు.

"అయితే, ఇంకెలా నయమవుతుంది?"

"నాకు తెలియదు"

మందు మాత్రలతో నయంగాదు. ఇంకా దేనివల్ల నయమవుతుందో తెలియదు. అయితే నా రాత ఒక్కసారి భగ్గుమనిపిస్తారా?"

కాశీనాథుడు సంస్కృత పాఠశాలలో చదువుకున్న నిర్మల హృదయుడు. ప్రేమలాలిత్యం అతనికి తెలియదు. ప్రణయాలాపం అతను ఎరుగడు. అయినా ఈ సమయంలో స్వభావికమైన ప్రేమలో మగ్నుడై కమలచేయి పట్టుకుని — "ఇక్కడ నాకు సుఖంగా ఉండడంలేదు. అందుకనే అలా అయిపోతున్నాను" అన్నాడు కన్నీరు తుడుస్తూ.

"అయితే ఇంకా ఇక్కడ ఉండట మెందుకూ?"

"ఉండక ఎక్కడికి వెళ్ళను?"

"ఇక్కడగాక ఇంకెక్కడా చోటు లేదా ఏమిటి? మీకు ఎక్కడ సుఖంగా వుంటే అక్కడికే వెళ్ళి వుండండి"

"అది వీలుపడదు"

"ఎందుకు వీలుపడదు ?"

"ఇక్కడ వుండకపోతే మామగారికి బాగుంటుందా?"

"ఇట్లా—చిక్కి క్షీణించి శల్యావశిష్టమవడం మాత్రం వారికి బాగుంటుందా?"

"బాగుండదు. ఇంకా ఉపాయమేముంది? మీ బాబు-బీదవాడని చూచి......"

కమల భర్త నోటిమీద చెయ్యేసి తర్వాత అననియ్యక— "రామ, రామ! అటువంటిమాట లనకండి! బైటపెట్టి, కపటం విడచి విషయమంతా నాకు చెప్పండి. నేను ఏదో ఒక ఏర్పాటు చేస్తాను."

కాశీనాథుడు ఆలోచించి అన్నాడు-"సంగతులన్నీ విశదంగా నీతో చెప్పలేను" మళ్ళీ కొంచెంసేపు మౌనంగా వుండి అన్నాడు—"ఇదంతా చూస్తే మనిద్దరికి పెళ్ళిగాకుంటే బాగుండేదనిపిస్తోంది."

"ఎందుకని?"

"నన్ను చేసుకుని నువ్వొక్క రోజునైనా సుఖపడ్డావేమో చెప్పు? నాకు ప్రేమవిధులు తెలియవు. గౌరవ మర్యాదలు అంతకంటె తెలియవు. అట్టె ఆలోచిస్తె అసలు ఏమీ తెలియవనేఅనుకోవచ్చు. నీకీ వయస్సులో ఎన్ని కోర్కెలు, ఎన్ని కల్పనలు వుంటాయో వాటిలో నావల్ల ఒక్కటైనా తీరిందా? నేను నీ పతిచ్ఛాయనే గాని, పతిని గాను."

కమల కళ్ళవెంట నీళ్ళు కారసాగినాయి. ఈ సంగతులన్నీ సరిగ్గా తెలుసుకోనుకూడా లేకపోయింది. ఒక్కమాట మాత్రం ఆమె అంతర్యంలోంచి బైటికిరావటానికి ఉచ్చునపడ్డ పక్షిలాగ కొట్టుకులాడుతూ వుంది. కంపితస్వరంతో కమల అడిగింది. "నన్ను మీరు చూడ లేరా?"

"ఈసంగతి ఇంకెప్పుడైనా చెబుతాను."

"అయితే,- నన్ను పెళ్లి చేసుకొని నిజంగా మీరు

సుఖపడ లేదా?"

"ఏమో, బహుశా సుఖపడ లేను."

"ఇంకెవరినైనా పెళ్ళిచేసుకుంటే సుఖపడేవారేనా?"

"అదీ - సరిగ్గా చెప్పలేను."

విని కమల నిశ్చేష్ట మయిపోయింది. ఇంతలో బైట నుండి దాసీది వచ్చి-"అక్కయ్యగారూ, అమ్మగారికి జ్వరం మండిపోతూవుంది-మిమ్మల్ని పిలుస్తున్నారు" అని చెప్పింది.

కమల కళ్ళు తుడుచుకుంటూ బైటికి వెళ్ళిపోయింది.

౫

కమల తల్లికి జ్వరం తగ్గలేదు. పదిహేను రోజులు బాధపడి చివరికి ఒక రోజున అందర్నీ ఏడ్పించి ఇహలోక యాత్ర చాలించింది. భార్య మరణం ప్రియబాబుకి చాలశోక విషయమైంది. ఈ వృద్ధాప్యంలో తను ఇంకెక్కువ రోజుల చుట్టాన్ని కాదనికూడా అనుకున్నాడు. ఇప్పుడు బరువుభారాలన్నీ కమలమీద పడ్డాయి. లోకంలో మానవుడికి తనసుఖ చింతనే కాకుండా ఇంకా చాలా చేయాల్సివస్తుంది. తండ్రి రోజురోజుకీ కృశించి పోతున్నాడు. అందుకని కమల ఇరవై నాలుగు గంటలూ అతన్ని వెన్నంటే వుంటోంది. మరి కాశీనాథుడు - అతను తనరాగమే ఆలాపిస్తువున్నాడు. సందు దొరికితే చాలు, గదిలోకెళ్ళి గొళ్ళెం పెట్టుకొని పుస్తకాల దొంతర్లలో మునిగిపోతాడు. వాటిమీద విసుగుపుట్టినప్పుడు మాత్రం గొళ్ళెంతీసి బైట ప్రపంచంలోకి వస్తాడు. ఒక్కొక్కప్పుడు రెండు మూడు రోజులవరకు ఇంటి మొహమే చూడడు. ఎక్కడ తింటాడో, ఎక్కడ తిరుగుతాడో ఎవ

రికీ అంతు వుండదు. ఇదందాచూచి కమల పూర్తిగా నిరాశురాలై పోయింది. యవ్వనవతైనప్పటికీ ఆమెఇంతవరకు చిన్నతనపు సరిహద్దులను దాటనేలేదు. పతిప్రేమ, పతిభక్తి ఏమిటో పూర్తిగా ఆమె ఇంతవరకు నేర్చుకోనేలేదు. నేర్చుకుంటూ వుండేప్పటికి విఘ్నం వాటిల్లింది. అదికూడా భర్తవల్లనే. దానిలో ఆమె దోషమేముంది? నేర్చుకున్నదిగూడా మర్చిపోసాగింది. ఆమెహృదయ ఫలకంమీద పడిన సువర్ణరేఖలు ఇంకా మెరవనేలేదు. బాహ్యసౌందర్యం ఇంతవరకు ఆమె అంతర్యంలో ప్రతిబింబించనేలేదు. నిర్లక్ష్యం, అజాగ్రత్తవల్ల క్రమంగా కృశించసాగినవి. చివరికి అవెప్పుడు తుడుచుకుపోయినాయోకూడా కమలకు తెలియదు. అప్పుడప్పుడూ, నిర్మించుకుంటున్న గొంప కూలిపోతోందే, రాళ్ళు ఎక్కడివక్కడ పోతున్నాయే, ఎక్కడికర్రలు అక్కడేపడివున్నాయే, అని పరితాపపడుతుంది. గాని వాటి నన్నిటినీ పోగుచేసి మళ్ళా గొంప నిర్మించుకుందామను సంకల్పంగానీ, సామర్థ్యంగానీ ఆమెలో లేదు. ఒకప్పుడు ఇక్కడ రాజప్రాసాదము వుండేది. క్రీడావనా లుండేవి. కాని అవన్నీ స్వప్నంలోనే వచ్చాయి. కన్ను తెరచేప్పటికి మాయమైనాయి. ఇప్పుడు మళ్ళా వాటిని-ఆసుఖస్వప్నాలను చూద్దామని కోర్కె ఆమెకు లేదు. జరిగిందేదో జరిగిపోయింది.

తండ్రి సేవలు, నౌకర్లచేత పనిపాటలు చేయిస్తూ ఉండడం మొదలైన 'కర్మసౌఖ్యం'తో కమలకు కాలం గడిచిపోతూవుంది. ఒకరికి ఒకదాంట్లోదొరికేసుఖం మరొకరికి దాంట్లో బహుశా దొరకదు. కమల పొందుతున్న సుఖాన్ని

చూచి ముసలిదాసీ చాల క్లేశపడుతూ వుండేది. ఆఖరికి ఒక నాడు ప్రియబాబు ఒంటరిగా వున్నప్పుడుచూచి "చిన్న బాబుగారు అలా అయిపోతున్నా రెందుకనో తెలియదు. ఒకరోజున ఇంటిపద్ద వుంటారు. మరోరోజున వుండరు. ఎప్పు డేమి చేస్తూవుంటారో ఇంట్లోవాళ్ళకున్కూడా అంతుపట్టదు. అమ్మాయిగారితోకూడా మాట్లాట్టం లేనట్టుంది" అని చెప్పింది.

ప్రియబాబు తనవంట్లో సరిలేక బాధపడుతూ వీటి యందు ఎక్కువ ధ్యానముంచటం లేదు. ముసలిది చెప్పిన మీాదట అతనికి కొంచెం శ్రద్ధకలిగింది కమలరాగానే పిల్చి దగ్గర కూర్చోపెట్టుకుని - "అమ్మాయ్! నేనొకమాట అడుగుతా. నిజం చెబుతావ్ ?" అని ఆదరంగా అడిగాడు.

"ఏం మాటనాన్నా" - కమల తండ్రి మొహంకేసి చూచి అన్నది.

"చూడు అమ్మా, నాముందు సిగ్గుపడే పనేమీా లేదు. కష్టసుఖాల్లో తండ్రిదగ్గర ఏసంగతీ దాచనేగూడదు. సంగ తేమిటో చెప్పు. నేనున్నాగా మీాపోట్లాటలుతీర్చే వాణ్ణి?" అన్నాడు ప్రియబాబు.

కమల మాట్లాడ లేదు.

"నువ్వు సుఖపడతావనే గదూ, నేను తగినవరుణ్ణి వెతికి తీసుకు వచ్చింది? నువ్వుగాక నాకు యింకెవరున్నారు చెప్పు. నువ్విలా దుఃఖపడుతూ వుంటూంటే నా ఆత్మకి సుఖం వుంటుందా?" - ప్రియబాబు కళ్ళల్లో నీళ్ళు తిరిగి నాయి. కమలకూడా అదేస్థితి! తండ్రి ప్రేమతో - "సంగ

కాశీనాథుడు తలెత్తిచూచి, "కమలా! నువ్వా అన్నాడు ఆశ్చర్యంతో.

"ఆఁ! నేనే."

"కూర్చో"అని కాశీనాథుడు మళ్ళా పుస్తకం వైపుకి తలమళ్ళించాడు. కమల చాల సేపటి వరకు భర్త కేసి చూస్తూ కూర్చుంది. తర్వాత తన చేతులతో పుస్తకం తీసి మూసింది. కాశీనాథుడు ఆశ్చర్యంతో తలెత్తి చూచి—" మూశేశావేం?" అన్నాడు.

"చదువు ఎప్పుడూ వుండేదేగా ఇవ్వాళ ఏమన్నా కబుర్లు చెప్పండి. ఒక్కరోజు చదువనంతమాత్రాన పోయే దేమీ లేదులే"

"అందుకేనా పుస్తకం మూసింది?"

"అందుకుగాదు. మీకు కోపం వస్తుంది. ఏమైనా అంటారు. విందామని—"

కాశీనాథుడు ముసిముసి నవ్వునవ్వి, అన్నాడు. "ఎందుకు కోపమొస్తుంది కమలా? నిన్నెప్పుడైనా చిన్న మెత్తుమాటన్నానా? నువ్వు నాదగ్గరకురావు. మాట్లాడవు పుస్తకాలన్నా చదువకపోతే కాలమెట్లా గడుస్తుంది. చెప్పు?" మళ్ళా కొంచెంనవ్వి "జ్వరం వస్తోంది. రెండురోజులనుండి తిండీ తిప్పలులేవు. నువ్వు ఒక్కసారైనా వచ్చి అజ కనుకున్నావు?" అన్నాడు మళ్ళా.

కమల తలెత్తి చూచింది. భర్తమొహం పూర్తిగా వాడిపోయింది. తలమీద చెయ్యేసి చూచింది. చాలా వేడిగా వుంది. ఆమె ఏడుస్తూ భర్త పాదాలమీదపడింది. సిగ్గుతో

ఆమెకు చావాలనిపించింది. "నాతప్పులన్నిటినీ మన్నించి, మళ్ళా ఒకసారి నన్ను మీదాన్నిగా చేసుకోండి. మీబరువు భారాలన్నీ నన్ను వహించ నియ్యండి" కమల ఏడుస్తూ అన్నది.

నీవు దాన్ని సంబాళించగలవా?"

"ఎందుకు సంబాళించలేను?"

"చూస్తాను."

"నన్ను మీదానిగా చేసుకోండి"

"చాలారోజుల క్రితమే నాదానిగా భావించాను. కాని నీవు అది గుర్తించలేదు, ఇప్పటికైనా గుర్తించావో లేదో?"

కమల దీపము వెలుగున ఆమొహం కన్నారచూచింది. ఆ మొహంలో నివురుగప్పిన నిప్పుకణాలున్నాయి. మౌనంతో కప్పబడిన మధువుందని అనుకున్నది మనసులో. ఒక్క నిమిషం తన్నుతాను మరచిపోయింది. "నన్ను ఇన్ని రోజులవరకు ఎందుకు అర్థంచేసుకోనివ్వలేదు? మీరుమిమ్మల్ని కప్పిపెట్టుకునే నన్నింత కాలం వేధిస్తూ వచ్చారా?"- ఉద్రేకంతో అనేసింది కమల. ఆనందంలో ఒక్కసారి భర్త హృదయానికి హత్తుకుపోయింది. కాశీనాథునికి కూడా ఆరోజు కంటనీరు తిరిగినాయి.

౬

మర్నాడు ప్రియబాబు కాశీనాథుని దగ్గరకు పిలచి "నా ఘటం ఏం శాశ్వతం నాయనా! ఎప్పుడువెళ్లిపోతానో! నా ఆస్తిపాస్తులప్పగించి పోటానికి నీకన్నా నాకు ఇంకొకళ్ళు

వున్నారా! అంతా నీవే. నేను బ్రతికుండగానే అంతా చూచుకో. లేకపోతే లోకులు నీకొక్క సెంటుకూడా దక్క నివ్వరు'' అని చెప్పాడు.

కాశీనాథుడు వంచినతల ఎత్తకుండానే ''మీా యిష్టం'' అన్నాడు.

''ఇంకా నాయిష్టమేముంది. రేపటినుంచి రోజూ ఉదయం కచేరికెళ్ళి కూర్చుంటూావుండు.''

''సరే'' నని కాశీనాథుడు మెదలకుండా వెళ్ళిపోయాడు. ప్రియబాబు కుమార్తెను పిలచి ''అమ్మా, నేనువృద్ధాప్యంలో పనిపాట లేమీా సంబాళించలేను.అందుకని జమీాందారీ భారమంతా కాశీనాథునిమీాద పెట్టాను. ముందేమీా హైరానాపడకుండా నేను బ్రతికుండగానే దానిలోని లగువు బిగువులు చెపుతూ ఉంటాను.'' అన్నాడు.

కొన్ని రోజులవరకు ప్రియబాబు కాశీనాథుణ్ణి స్వయంగా కచేరీకి వెంటబెట్టుకువెళ్ళి జమీాందారీకి సంబంధించిన గుట్టుమట్టులన్నీ తెలియజేసాడు. తనకొక బాధ్యత ఏర్పడినందుకు కాశీనాథునికి చాలా సంతోషం కలిగింది.అతని ఆంతర్యంలో మండుతున్న జ్వాలలు మెల్లమెల్లగా చల్లారసాగినాయ్.

ఇప్పుడు కాశీనాథుడు జమీాందారీ పనులు నియమంగా చూచుకుంటున్నాడు. కమల నియమంగా ఇంట్లో పని పాటలు చూచుకొంటోంది. ప్రియబాబు నియమంగా మంచం మీాదే పడి వుంటున్నాడు. ఈ విధంగా సంసారం చాలా ఆనందంతో గడిచిపోతోంది. కాని రోజురోజుకి ప్రియబాబు

శరీర స్థితిమాత్రం చెడిపోసాగింది. ఒకరోజున కుమార్తెను పిల్చి- "వీలునామా వ్రాయించుకువచ్చాను" అని దిండుకింద నుంచి ఒక కాగితం తీసి- "నేను నా హక్కు భుక్తములైన-చరాస్థిస్థిరాస్థు లన్నిటిలోనూ సగభాగం అల్లుడు కాశీ నాథునికి,సగభాగం నీకు వ్రాసియిచ్చాను." "ఏం అమ్మాయి బాగుందా!'' అన్నాడు.

కమల మాట్లాడ లేదు. ప్రియబాబు - "ఏం అమ్మాయ్ ఇది నీకు నచ్చలేదా!'' అన్నాడు విస్మయంతో. అతను ఆవిల్లు రాయించింది సగం కమలను సంతోష పెట్టటానికే. ఆస్తిలో సగభాగం కాశీనాథునికి రాసిఇచ్చినప్పటికి కమల చాల సంతోషిస్తుందని అతని తలంపు. కాని తన ఆలోచనలోని విషయాన్ని నోటితో చెప్పటానికి కమలకు సిగ్గయింది. "నీకేమైనా సందేహమా అమ్మా!" అని ప్రియ బాబు మళ్ళీ అడిగాడు.

కమల తలవూపి "మరే" నన్నది.

"ఏమిటమ్మా అది!''

"ఆస్తంతా నాపేరేరాయించండి" - కమల కొంచెం జంకుతో అన్నది.

"ఎందుకని అమ్మా!"

కమల తలవంచుకు మెదలకుండా కూర్చుంది.

ప్రియబాబు పూర్వానుభవంగల మనిషి. నాలుగు కాలాలుచూచిన అతను కమల హృదయంలోని విషయాన్ని గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. ఒక్కొక్కటిగా సంగతులన్నీ వింటూన్నకొద్దీ, గంభీరంగా ఆలోచిస్తున్నకొద్దీ

శరీరమంతటా ఒకవిధమైన పీడ వ్యాపించసాగింది. అనుకున్న దిండుమీద తలపెట్టి కొంచెంసేపు కన్నుమూసి పండు కొన్నాడు. చాలాసేపు మౌనంగా వున్న తరువాత "నువ్వు నాకు ఒక్కగానొక్క బిడ్డవు. నిన్ను దుఃఖపెట్టడం నాకు ఇష్టంలేదు. ఆస్తంతా నీకే రాసియిచ్చిపోతాను. కాని ఆపని అంతమంచిదికాదు. నేను నిన్ను సుఖపడమని ఆశీర్వదిస్తు న్నాను. కాని అటువంటి ఆశలు నాకేమీ కనుపించటం లేదు. నాదీర్ఘ జీవితంలో నేను చాల చూచాను. విన్నాను. స్వయంగా మూడుసార్లు వివాహాలు చేసుకు న్నాను. కాని ప్రపంచంలో ఏ స్త్రీకూడా ఇటువంటి హృద యంపెట్టుకుని సుఖపడలేదు. "కొంచెంసేపు మెదలకుండావుండి "చూట్టానికీ-వింటానికీ బాగుంటుందనీ, నువ్వుకూడా సంతో షిస్తావనీ, ఇద్దరికీ చెరిసగం రాయించాను. మీరిద్దరూ భిన్నులు కారని నాకు తెలుసు. సరే, చెప్పమ్మా! ఎందుకని అతని పేర రాయించొద్దంటున్నావ్?" అన్నాడు మళ్ళా.

"ఆస్తి చేజిక్కితే మళ్లా నావైపు కన్నెత్తి చూచే వాళ్ళుంటారా?" కమల దుఃఖస్వరంతో అన్నది.

"ఆస్తి చిక్కకపోతే?"

"నాచేతుల్లో వుంటారు"

"కాశీనాథుణ్ణి నేనుబాగా ఎరుగున్నాను. కాని నువ్వె రుగవు-అతను సరిగ్గాతండ్రిలాంటివాడు. అతను నిన్నుచూడని పరిస్థితుల్లోఆస్తిచిక్కినా చూడడు. చిక్కకపోయినాచూడడు. ఈ విధంగా భర్తను చేతుల్లో పెట్టుకోగలవా అమ్మా! బల వంతంగా ఒక అడవిసింహాన్ని వశం చేసుకోవచ్చుగాని ఒక

పసరు మొగ్గను వికసింప జేయగలమా?'' అన్నాడు ప్రియ బాబు.

కొంచెంసేపు మెదలకుండా వుండి 'ఇది మంచిది కాదమ్మా! అతనునిన్ను స్వీకరించనప్పుడు, నీదగ్గర వుండేది మాత్రం ఏమిటి? ఉన్నదానికి సగంఆస్తి చాలదూ! ఆత్మసర్వ స్వమూ ఇవ్వదగినభర్తకు సగంఆస్తి ఇవ్వలేవూ! అలా చెయ్యకు కమలా! అతనువింటే చాల దుఃఖపడతాడు" అన్నాడు మళ్ళా.

కమల సమాధానమేమీ చెప్పలేదు. ఇద్దరూ ఒక అరగంటవరకూ మెదలకుండా కూర్చున్నారు. చీకటి పడొచ్చింది. దాసీది గదిలో దీపం వెలిగించి పోయింది. కమల కూడా కళ్ళుతుడుచుకొని తనపని సర్దుకోటానికి వెళ్ళింది.

మర్నాడు ప్రియబాబు తన ప్లీడర్ని పిలిచి "వీలు నామా మార్చాలి" అన్నాడు.

"ఏం, మార్చాలనుకున్నారు?" - ప్లీడరు అడిగాడు.

"అల్లుడు పేరమీనేసి అస్తి అంతా కుమార్తె పేరే వ్రాయించదలచాను."

''ఎందుకని?"

"ఇది మీరడగవలసిన ప్రశ్నగాదు. నేను చెప్పినట్లుగా వ్రాయండి."

## ౭

ప్రియబాబు చనిపోయాడు. శ్రాద్ధకర్మలన్నీ అయి పోయినాయి. మామ రాసిపోయిన వీలునామావల్ల కాశీ

నాథునికి కించిత్ దుఃఖంగానీ, విస్మయంగానీ కలుగలేదు. ప్రపంచంలో ప్రతినిత్యం ఏం జరుగుతుందో, ఏం జరగవలసి వుందో అదే జరిగింది. దీనిలో - దుఃఖం పడేంతగాని, విస్మయం చెందేంత గానీ విశేషమేముంది? అయినా దివాను కాశీనాథుణ్ణి ఒంటరిగా పిల్చి— "అబ్బాయిగారూ, బాబుగారలా చేస్తారని నేను స్వప్నంలోకూడా అనుకోలేదు. ముందు ఒక విల్లురాయించారు. దానిలో సగం ఆస్తి మీకు చెందేట్టు, సగం ఆస్తి కుమార్తెకు చెందేట్టు వుంది. అది మళ్ళా ఎందుకు మార్చారో, ఎవరి సలహావల్ల వారి బుద్ధి ఇలా మారిందో అర్థంకాకుండా వుంది" అన్నాడు.

"తెలుసుకోవాలన్నంత అవసరమేముంది? దాంట్లో నాకేం, మీకేం?" ఎవరి ఆస్తో వారికిచ్చిపోయాడు?

"అయినా ... ... ...? అయినా ... ...? " అని తటపటాయిస్తూ అన్నాడు దివాను.

"అయినా గియినా అనటానికి దానిలో సంశయమేముంది? నిజం ఆలోచిస్తే ఈ సంపత్తిమీద నాకేం అధికారం లేదు. కాని దానిలో నాక్కూడా సగం యిచ్చిపోతే మాత్రం — అప్పుడు ఆశ్చర్యంగా వుండేది. నాకు సగం యిచ్చిపోవటమన్నా, ఆమెకు పూర్తిగా యివ్వటమన్నా రెండు ఒకటే. భేదమేముంది?"

దివాను మరింత తెల్లబోయాడు. "లేదు, లేదు, భేదమేమీ లేదు,- నేను పెదబాబుగారిని గురించి అన్నాను. నేను వారి వుద్దేశం బాగా ఎరుగున్నాను కాబట్టే ఈ మాట అన్నాను" అన్నాడు శుష్కవదనంతో.

"వారు తమ కర్తవ్యమేదో అది చేశారు. స్త్రీకి పతి కన్న మరొక గతివుండేమో ఆలోచించండి. కాని పతికి మరొక గతి వుండవచ్చు. నేనుస్థితి తప్పవాణ్ణి. ఒకసారి, ఇంత ఆస్తి చేజిక్కేప్పటికి కథ అడ్డం తిరుగొచ్చు. ఆ సందేహంతోనే వారిలా మార్చివుంటారు."

ముసలిదివాను కాశీనాథుణ్ణి ఎప్పుడూ చదివిన మూర్ఖుడనుకుంటూ వచ్చాడు. కాని అతని నోటినుండి ఇటువంటి తెలివిగలమాటలు వచ్చేప్పటికి అతనికి ధన్యవాదా లర్పించక వుండ లేకపోయాడు. ఈ విధంగా ముసలి దివాను కాశీనాథుని తెలివితేటలు క్రమక్రమంగా అవగాహన చేసుకో సాగాడు. అటు కమలకూడా మరీఎక్కువ అజ్ఞానం కనిపించ సాగింది. ఇతను ఎటువంటి మనిషా? అని రోజుకు వందసార్లు తన్ను తానుప్రశ్నించుకునేది. కాని ఆ విఫలప్రశ్న వందసార్లు కూడా నిరాశతో తిరిగివచ్చి అర్థం కావటంలేదు అంటూ వుండేది.

అనేక ప్రయత్నాలు అనేక సంకల్పాలు చేసినప్పటికి కూడా కమల ఆ వింతమనిషిని అర్థం చేసుకోలేక పోయింది. అతను తన మనస్సుని తన శరీరంలోనే వుంచాడో, ఇంకెక్కడైనా విడిచిపెట్టాడో కూడా తెలియదు. ప్రపంచమంతా ఎలా పోతోందో, తనభర్త అలాగే పోతున్నాడని మాత్రం ఆమెకు తెలుసు- భోంచేస్తాడు, నిద్రపోతాడు, జమీందారీ పనులు గృహకార్యాలు చక్కబెట్టుకుంటాడు, అన్నీ చేస్తాడు, అన్ని విషయాల్లోనూ శ్రద్ధచూపిస్తాడు, అన్నివిషయాల్లోనూ నిరుత్సాహం కూడా వుంటుంది. ఆఖరికి తన భర్తకి ఏవస్తు

వుయిష్టమో, దేనియందు మక్కువో నన్న సంగతికూడా ఆమె యింతవరకు తెలుసుకోలేక పోయింది. కమలకు ఎప్పుడైనా కొంచెం సుస్తీ చేస్తేసరి కాశీనాథుడు రాత్రింబవళ్ళు ఆమె మంచం దగ్గరే పడివుంటాడు. అప్పుడతని విషాద వదనంలోంచి ప్రేమ, వాత్సల్యం వెల్లువలుగా బైటికిపొల్లుకొస్తూ వుంటాయి. కొంచెం కులాసాగా ఏర్పడి తిరగడం మొదలు పెడితేచాలు ఆమె ఎదురుపడినా కన్నెత్తైనా చూడడు. తన ధోరణిలో, తనపనిమీద పోతూవుంటాడు. కమల అలిగి రెండేసిరోజులు అన్నంతినకుండా వుండిచూచేది. కాని లాభమేమి కనిపించేది కాదు. కాశీనాథుడు ఎప్పటిలాగానే దగ్గరకు వచ్చేవాడు. వెళ్ళిపోయేవాడు. బ్రతిమాలేవాడు కాదు. కంటతడి పెట్టేవాడు కాడు. ఆఖరికి పన్నెత్తి పలుకరించేవాడు కూడాకాదు. మళ్ళా ఎప్పుడైనా కమల పలుకరించితే చాలు – చిరునవ్వుతో ఎప్పటిలాగానే మాట్లాడేవాడు. ఏనాడూ ఆమెమీద కోపగించుకోనూ లేదు. నువ్వు రెండు రోజులనుంచి మాట్లాడ కుండా కోపంతో ఎందుకు వున్నావని అడగనూలేదు. కొన్ని రోజులు కమల మనసులో తర్జన భర్జన చేసుకుని ఆఖరికి తన ఉదాసీన భర్తకు 'నువ్వునన్ను లక్ష్యం చెయ్యటంలేదు. నేను కూడా నిన్ను లక్ష్యం చెయ్యకుండా వుండగల' నని తన ఉద్రేకాన్ని తెలియజేయ నిశ్చయించుకుంది; 'నీ కాళ్ళక్రింద పడి నలగటానికి, నీ పాదాలు పట్టుకు తిరగటానికీ నేను నిన్నంతగా ప్రేమించటంలేదు. దయదలచి నిన్ను నాభర్తగా చేసుకున్నంత మాత్రాన నాప్రాణాలు నీ పాదాలు ముందు

పడివున్నాయనిగానీ, నిన్ను చూడగానే తియ్యని చిరునవ్వులతో ప్రేమ లాలింపులు చేస్తానని గానీ అనుకోవద్దు!' అన్నట్లుగా భర్తను చూడగానే మొహం తిప్పుకుని గంభీరంగా తన పనికిపోయేది కమల.

కమల ఎప్పుడైనా నౌకర్లని కోప్పడుతున్నప్పుడు దైవవశాత్తు కాశీనాథుడు ఏమైనా అందుకుంటే చాలు, ఆమాట విన్నీ విననట్టుగా—నా నౌకర్లు, నాయిల్లు, నాయిష్టమైతే ఏమైనా అనుకుంటాను. మధ్యలో కల్పించుకోటానికి నువ్వెవ్వరవు' అన్నట్టు మరింత రెచ్చిపోయేది.

కాని అంతమాత్రాన ఆమెకు ఏంసంతృప్తి కలుగుతుంది? ఈవిధంగా ఏంకోర్కె తీరుతుంది? కాశీనాథుణ్ణి కించితైనా కదిలించగలిగితే కొంచెంసంతృప్తికలిగేదేమో! ఎవరెన్ని చేస్తూవున్నా అతని ప్రశాంత గంభీరలలాటం – 'నేను నాలో నిశ్చలంగానే వున్నాను. సుమేరు పర్వతంలాంటి నన్ను అణుమాత్రమైనా కదిలించే శక్తి నీలో లేదు. నువ్వెన్ని తుపానులు లేపినా నన్ను కదల్పలేే' వని సమాధానమిస్తూ వుండేది.

సరే – కమల ప్రేమించడం లేదా? ప్రేమిస్తోంది! కాని ఆప్రేమ అనంతము, అగాధముకాదు. ఆమె ఒక గీటు గీచి – 'నువ్వు దీన్ని దాటిపోవద్దు, పోతే నేను సహించలేను. అప్పుడుకూడా ప్రేమిస్తానేమోగాని, నిన్నిలా గౌరవించలేను' అని చెప్పాలనుకుంటుంది.

ఒకరోజున ఆమె ముసలి దాసీముందు తన దుఃఖాన్ని బైట పెట్టింది – "బాబుగారు నన్ను ఒక జంతువు చేతిలో పెట్టిపోయారు."

"అదేమిటమ్మా?"

"నన్నడుగుతావెందుకు? మీరంతా కలసి కాళ్ళూ చేతులూకట్టి నూతులో పారెయ్యక?"

"అలాంటిమాటలు అనగూడదమ్మా!"

"ఎందుకు అనగూడదు? మీరు చేసిన పనిని నేను ఒక్కసారి నోరెత్తి కూడా అనుకోగూడదా?"

"అదిగాదమ్మా! మతిభ్రమ కొంచెం కనబడుతుంది. కాని ఆయన చాల మంచిమనిషి. తండ్రిలోకూడా కొద్దిగా ఆ లక్షణాలే వుండేవి, అలాగే కొడుక్కికూడా —"

"వాగబోకు మతిభ్రమ అనేమాట నోటి నుంచి రానియ్యబోకు. తండ్రికి మతిభ్రమవుంటే కొడుక్కికూడా వుండాలనివుందా? మతిభ్రమ ఏమీకాదు. తెలిసే నన్నిలా వేధిస్తున్నారు?"

పతికి మతిభ్రమ అనే విషయాన్ని అంగీకరించటానికి ఆమె హృదయానికి చాల కష్టం కలిగింది.

ఇనాల్టికి మూడురోజులైంది, కాశీనాథుడు అంతూ పొంతూ లేదు. రెండురోజులవరకూ కమల తెలిసినాకూడా పట్టించుకోలేదు. కాని మూడోరోజున జవాన్ని పిలిచి "బాబుగారు రెండు రోజులనుండి ఇంటికిరాలేదు. మీరంతా ఏమి పట్టించుకోనేలేదేరా: మరి మీరంతా ఎందుకురా?" అని వాడిమీద మండిపడింది.

'బలేగావుందే ఇది, ఎవరెక్కడికి వస్తూపోతూ వుంటారో మాకేం తెలుస్తుందమ్మా!' అని సణుక్కుంటూ జవాను వెళ్ళాడు. తరువాత బాబుగారు మూడువేల

రూపాయలు తీసుకుని వెళ్ళారని షరాబుద్వారా తెలిసింది. కాని ఎక్కడికి వెళ్ళారో, ఎప్పుడు వస్తారో ఎవరికీ చెప్పి పోలేదు.

కొంచెం సేపు కమల నెత్తిమీద చేతులు పెట్టుకొని దిగాలపడికూర్చుంది. తరువాత తనతండ్రిగారి వకీల్ని పిలిపించి "మా జమీందారీ వగైరా పనిపాటలు సంబాళించ డానికి సమర్థుడైన వ్యక్తిని ఒక వారంరోజులలో కుదర్చండి, ఎంతజీతమైనా సరే ఇద్దాం" అన్నది.

## ౭

కాశీనాథుడు కలకత్తా చేరుకున్నాడు. రోజల్లా వర్షంలో మోకాళ్ళలోతు నీళ్ళు బాడిని పడి ఏదో విధంగా సాయంత్రానికి, ఒక చిన్నగొందిలోని యింట్లోకి ప్రవేశిం చాడు. అతని చేతిలో రెండు మందుసీసాలు, ఒక బిస్కట్ల డబ్బా, పైపంచె మూటన ఇంకేవో పళ్ళు ఉన్నాయి.

ఆయింటి గదిలో ఒక రోగి మంచంమీద పడుకొని మూలుగు తున్నాడు. ఒక స్త్రీ అతని తల వైపున కూర్చుని తల వత్తుతోంది. కాశీనాథుడు ఇంట్లోకి వెళ్ళగానే "ఇంత వర్షంలో తడుస్తూ ఎందుకువచ్చావు బావా ? ఎక్క డైనా కాసేపు నుంచోక పోయావు" అన్నది ఆమె.

"నుంచున్నందువల్ల కలిగేనష్టం తడిచినందువల్ల కలుగదమ్మా."

కాశీబావ చెప్పినమాట అబద్ధం కాదని తెలుసుకొని మాట్లాడలేదు బిందు.

గత కొద్ది సంవత్సరాలనుండి బిందుపడుతున్న కష్టాలు ఆమెకే తెలుసు. మనం ఆవిణ్ణి కన్నవారింటి దగ్గరనుండి వెళ్ళిన తర్వాత మళ్లా చూడలేదు. ఇప్పుడు ఆవిణ్ణి గురించి కూడా కొంత తెలుసుకోవడం అవసరం. ఆమె జమీందారు గారి బిడ్డను చూడ్డానికి ప్రయాణమై కూడా వెళ్ళలేక పోయింది. ఆ మరుసటి రోజునే - తన మామ గోపాలబాబుకి జబ్బుగా వుందని కబురు వచ్చేప్పటికి బైలుదేరి వెళ్లింది. నిజంగా మామ చాలా జబ్బుస్థితిలో ఉన్నాడు. ఎవ రెన్ని మందులిచ్చినా గోపాలబాబుని మాత్రం బ్రతికించలేక పోయారు. రోగం ఎక్కువవగానే గోపాలబాబు - "చిన్న కోడల్ని చూడాలని వుంది. నాదగ్గరకు పిలిపించండి. కళ్లతో కడసారి చూపు చూచుకుంటాను.'' అన్నాడు.

ఆ చిన్నకోడలు మన బిందువాసినే. చనిపోయేముందు గోపాలబాబు బిందువాసినిని పిల్చి "ఈతాళంచెవి తీసుకో అమ్మా! ఆపెట్టెలో ఉన్నవన్నీ నీకే ఇస్తున్నాను." అన్నాడు. "నేను సంపాయించి పోతున్నదికాక తృణమో ఫణమో సంపా దించుకుంటూవుంటే మీకు హాయిగా గడిచిపోతుంది.'' అని చెప్పిపోయాడు. బిందు చెయిజాపి తాళం అందు కుంది. ముసలాడు వున్న ముల్లెంతా చిన్నకోడలికే యిచ్చి పోయా డను కున్నారు తతిమ్మాకోడళ్ళు. మరోసంగతి. చనిపోతూ గోపాలబాబు కొడుకుల్ని పిల్చి - "మీలో ఒక్కడికికూడా ఒకడి పొత్తు ఒకడికి లేదు. మరి మీతల్లికూడా జీవించిలేదు. కాబట్టినేను పోయిన తర్వాత మీరు కలిసి మాత్రం ఉం డొద్దు" అన్నాడు.

తండ్రిపోయిన మర్నాడే అన్నదమ్ములు నలుగురూ వేర్లుపడ్డారు. ఒకరోజున బిందు మామ యిచ్చిపోయిన పెట్టె తెరచి చూచేప్పటికి - దానిలో 'రామాయణం,' మహా భారతం' తప్ప యింకేమీ లేవు, ఆశ నిరాశైనప్పటికి బిందు స్వర్గీయ మామగారిచ్చి పోయిన దానం కళ్ళ కద్దుకుని స్వీకరించింది. వారిచ్చిపోయిన ఈస్నేహదానమే ఒక రతనాల మూట అనుకుంది.

బిందు జీవితం కొంతకాలం సుఖంగానే గడిచింది. ఆ తర్వాత కొంత కాలానికి కష్ట పరంపరలు ప్రారంభమయినవి. ఆమెభర్త యోగేశబాబు, జబ్బుపడ్డాడు. బిందు తన ఆరోగ్యం చెడుతుందనే భయంకూడా లేకుండా రాత్రింబవళ్ళు అతని శుశ్రూష చేసింది. పొలమంతా తాకట్టుపెట్టి చికిత్స చేయించింది. కాని జబ్బుమాత్రం తగ్గ లేదు. ఇరుగు పొరుగు కలకత్తా తీసుకువెళ్ళి చికిత్స చేయించ మని సలహా లిచ్చారు. అప్పుడు బిందు తన వంటినున్న నగ-నాణ్యం అన్నీ అమ్మి కలకత్తా తీసుకొచ్చింది. అక్కడ అనేక చికిత్సలు చేయించింది. దానితో వున్న పొలం కాస్తా తాకట్టుక్రింద పడిపోయింది. కాని రోగం మాత్రం మళ్ళలేదు. డబ్బు లేకపోవడంమూలాన ఇప్పుడు మంచి వైద్యం చేయించేదారి కాస్తాకూడా పోయింది. బిందుకు తన పెద్దబావకి విషయమంతా రాసింది. కాని అతను జవాబైనా రాయలేదు తర్వాత మరుదులిద్దరికీ రాసింది. వారుకూడా తమ పెద్దన్ననే ఆదర్శంగా తీసుకొని మౌనం వహించారు. ఇక

పస్తులైనా వుండాలి. లేకపోతే విషమైనా తాగి చావటం తప్ప మరొకఉపాయం లేదనుకుంది బిందు.

భార్య మొహంచూచి యోగేశబాబు అంతా గ్రహిస్తూ వుండేవాడు. ఒకరోజున బిందును తన దగ్గరకుపిల్చి కూర్చోబెట్టుకొని "బిందూ నన్ను మనవూరికి తీసుకుపోరాదూ? చ స్తేపారేసేవాళ్ళుకూడా వుండరు ఇక్కడ" అన్నాడు చేయి నిమురుతూ స్నేహంగా.

బిందుకి చావుతప్ప మరోవుపాయం కనిపించలేదు. భర్తను ఇంటికి తీసుకువెళ్లే వీలుకూడా కనపడలేదు. పతిని ఈస్థితిలోవుంచి చావటం ఎలా? మరి చావాలే అనుకుంటే సిగ్గూ ఎగ్గూ చూస్తే ఎలా? ఇదంతా బాగా ఆలోచించి, సిగ్గువిడిచి ఆఖరికి ఒకరోజున తన స్థితంతా తెలియజేస్తూ కాశీనాథునికి ఒక వుత్తరం రాశింది. తర్వాత ఘటన మీకు తెలిసిందే.

వచ్చేప్పుడు కాశీనాథుడు తగినంత పైకం వెంట తీసుకు వచ్చాడు. ఆపైకంతో కలకత్తాలో మంచి మంచి డాక్టర్లవద్ద సలహాలు తీసుకున్నాడు. అందరూ గాలి మార్పు కలిగితేగాని స్వస్థత చిక్కదన్నారు. కాశీనాథుడు యోగేశబాబునీ, బిందునూ తీసుకుని వైద్యనాథ్‌కి వచ్చాడు. అక్కడ రెణ్ణెల్లు వున్నమీదట యోగేశబాబుకి కొంత స్వస్థత చిక్కింది. కాని ఇంకొకనెలపాటు అక్కడే వుండటంమంచిదని వారిని అక్కడే వదలిపెట్టి కాశీనాథుడు ఇంటికివచ్చాడు.

ప్రొద్దునే కమల కనబడి—"ఎప్పుడు వచ్చారు?" అని అడిగింది.

"రాత్రి"

కమల తనపనిమీద వెళ్లిపోయింది. కాశీనాథుడు బైటికివచ్చి కచేరీకి వెళ్ళాడు. చాల రోజులకి ఇవ్వాళ-హఠాత్తుగా చూచేప్పటికి కర్మచారులంతా లేచి నిలబడ్డారు. కాని సూటేసుకొని యున్న యువకుడు మాత్రం కుర్చీలో కూర్చునే తన పని చూచుకుంటున్నాడు. ఆ వచ్చిన వ్యక్తికి కర్మచారులంతా యిచ్చిన స్వాగతం అతను చూడనేలేదు. కాశీనాథుడు తనచేత్తో ఒక ఈజీచైర్‌ను దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు. కొత్తగా మేనేజరై వచ్చిన వ్యక్తిపేరు విజయ కిశోరదాసు. కలకత్తాలో బి.ఏ. ప్యాసయ్యాడు, మంచి కార్యదక్షుడు. అందుకని వినోదబాబు అతన్ని మేనేజరుగా నియమించాడు. కొత్తమేనేజరు కొంచెంసేపటికి తలెత్తి చూచి "ఏదైనా పనిమీద వచ్చారా?" అన్నాడు.

"లేదు, పనేమిలేదు. ఇక్కడి పనిపాటలు చూట్టానికి వచ్చాను."

"వీరే జమీందారుగారి అల్లుడుగారు" అన్నాడు దివాను లేచి.

విజయబాబు లేచి అతనికి నమస్కారము చేశాడు. ఇంతలో లోపలనుంచి నౌకరువచ్చి - "మిమ్మల్ని పిలుస్తున్నారు." అని చెప్పాడు.

విజయబాబు లోపలికి వెళ్ళాడు.

"ఇతనుఎవరు?"—కాశీనాథుడు దివానుని అడిగాడు.

"కొత్త మేనేజరు"

"ఎవరు నియమించారు?"

"అమ్మాయిగారు"

"ఎందుకు?"

"పనులు సరిగా సాగటంలేదు కాబోలు"

"ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాడు?"

"లోపలికి—"

తర్వాత ఇంకేం మాట్లాడకుండ కాశీనాథుడు లోపలికి వెళ్ళిచూచాడు:- గదిలో పరదాకి ఎదురుగా విజయబాబు నిలబడి వున్నాడు. లోపలనుంచి ఎవరో మృదుస్వరంతో మాట్లాడుతున్నారు. ఎవరితో మాట్లాడేదీ కాశీనాథుడు గ్రహించి మెదలకుండా బైటకి వచ్చాడు. మధ్యాహ్నం కమల ఎదురుపడి "ఆరోగ్యం బాగుందా?"అని గంభీరంగా అడిగింది. కాశీనాథుడు తల ఆడించి "బాగానే వుంది" అన్నాడు.

కమల ఇంకేం మాట్లాడకుండా వెళ్ళిపోయింది. నుంచుని మాట్లాడటానికీ, హాస్యం వేసుకోటానికీ ఇప్పుడామెకు తీరిక లేదు. అనేక పనులున్నాయి. జమీందారీ పనులతో ఆమెకు ఊపిరి పీల్చుకోటానికికూడా తీరడంలేదు. ఒకరోజున ప్రొద్దునే- కాశీనాథుడు క్రొత్త మేనేజరును రమ్మని కబురంపాడు "ఇప్పుడు తీరిక లేదు. తీరిక కాగానే వస్తా" నని వచ్చిన నౌకరుతో చెప్పమన్నాడు. అప్పుడు కాశీనాథుడు స్వయంగా కచేరీకి వచ్చి విజయబాబును ఒంటరిగా పిల్చి—"మీకు తీరిక లేదని నేనేవచ్చాను. ఇవ్వాళ నాకు ఐదువందల రూపాయలు కావాలి. తీరిక కాగానే పైకం పంపించండి" అన్నాడు.

"ఎందుకు కావాలి?"

"ఆ విషయం మీరు అడగతగ్గది కాదు."

"అడగతగ్గది కాదని ఒప్పుకున్నాను. కాని అమ్మ గారి అనుజ్ఞ లేందే ఎలా ఇవ్వను?"

కథ అడ్డం తిరిగిందని కాశీనాథుడు గ్రహించాడు. "నేను చెబితే చాలదా, ఇంకెవరి అనుజ్ఞో ఎందుకు?"

"ఎవరికి బడితే వారికి డబ్బు ఇవ్వద్దన్నారు"—విజయ బాబు గట్టిగా అన్నాడు.

కాశీనాథుడు కమలదగ్గరకు వెళ్ళి "ఆకొత్త మేనేజరుని తొలగించాలి" అన్నాడు.

"ఎవరిస్సీ?"

"మీ కొత్త మేనేజరుగా వచ్చినతన్ని"

"ఎందుకు? ఏం తప్పు చేశాడు?"

"నాతో సరిగా వ్యవహరించ లేదు."

"ఏం చేశాడు?"

"నేను కబురంపితే అతను రాకుండా నౌకరుచేత 'నా కిప్పుడు తీరిక లేదు, తీరిక కాగానే వస్తా నని' కబురంపాడు."

"తీరిక లేదేమో చేతిలో పనివుంచుకొని ఎలావస్తాడు?" కమల నవ్వుతూ అన్నది.

"తీరిక లేదు. చేతిలో పనివుంది. అందుకని రా లేక పోయాడని ఒప్పుకుందాం! నేను స్వయంగా వెళ్ళి డబ్బు అడి గితే అమ్మగారి అనుజ్ఞ లేందే యివ్వను అనటం?" — కాశీనాథుడు భార్య మొహంవైపుచూస్తూ అన్నాడు.

"ఎంతమొత్త మడిగారు." — కమల విరగబడి నవ్వుతూ అన్నది.

"ఐదువందలు"

"ఇవ్వలేదా?"

"లేదు. నువ్వు నాకేమైనా డబ్బు ఇవ్వొద్దని చెప్పావా?"

"అవును ఈ విధంగా డబ్బు హరించటం నాకు ఇష్టం లేదు."

కాశీనాథుడు శిలారూపుడైనప్పటికి కూడా చాలా దుఃఖం కలిగింది. ఇటువంటి వ్యవహారం, ఇటువంటి మాటలు, అతను ఇదివరకెప్పుడు వినలేదు. "నాకు ఇవ్వట మంటేహరించటమేనా?"— చాల బాధతో అన్నాడు.

"ఏదోరూపంగా నష్టపరచడమే హరించటం"

"అవసరం వచ్చినప్పుడు ఖర్చుపెట్టడం హరించటం కాదు."

"ఏం అవసరం?"

"ఎవరికో ఇవ్వాలి"

"ఇస్తే మళ్ళా వచ్చేవిధమేది? నీముల్లె ఏమైనా వుంటే తీసుకెళ్లి" ఇచ్చిరా నేనేమీ కాదనను.

కాశీనాథుడు మళ్లీ మాట్లాడ లేకపోయాడు. ఈ మాటలు అతని హృదయంలో అగ్నిబాణాల్లాగ చొచ్చుకు పోయాయి. బైటికివచ్చి తన గడియారం, ఉంగరం మొదలైనవన్నీ అమ్మి వైద్యనాథ్‌కి మనియార్డరు పంపుతూ

కూపనుకింద "ఇక అడగవద్దు బిందూ! నావద్ద ఇంకేంలేదు." అని రాశాడు.

ఆరోజునుంచి కాశీనాథుడు మళ్ళాలోపలికి రాలేదు. కమలకూడా ఏమీ అడగనూలేదు. ఈ విధంగా కొన్ని రోజులు గడచిపోయినాయి. ఒక రోజున నౌకరువచ్చి-"మీ కోసం ఒక బ్రాహ్మణుడు వచ్చాడు" అని చెప్పాడు.

కాశీనాథుడు వెళ్ళి చూచేప్పటికి ఒక ముసలి బ్రాహ్మణుడు జంజెం నలుపుకుంటూ వాకిట్లో నిలబడి వున్నాడు. కాశీనాథుణ్ణి చూడగానే- "మీరు మహాదాతలు, ఈ బీద బ్రాహ్మడి సర్వస్వాన్ని అపహరించకండి......" అని విన్నవించ సాగాడు.

"ఏమి జరిగిందేమిటి?" కాశీనాథుడు భయపడుతూ అడిగాడు.

"మీకు భగవంతుడిచ్చింది చాలా వుంది. నాకీగడ్డ తప్ప మరో ఆధారం లేదు. దీన్ని కాస్త నిలపండి" అని లబ లబా ఏడవసాగాడు.

కాశీనాథుడు వ్యాకులపడుతూ బ్రాహ్మణునిచేయి పట్టుకొని చెంతకూర్చోబెట్టుకొని "అసలు విషయమేమిటో సరిగాచెప్పు" అని అడిగాడు. బ్రాహ్మడు ఏడుస్తూ "తమరు ధర్మాత్ములు. క్షేత్రపాలుభూమి నాదికాదా? నిజంచెప్పండి" అన్నాడు.

"నీదికాదని ఎవరంటారు?"

"అయితే - మీకొత్త మేనేజరు, విజయబాబు నామీద దావా ఎందుకు వేశాడు?"

"దావా వేశాడా? నాకు తెలియదే!"

సమను చూపించి బ్రాహ్మడు చెప్పసాగాడు - "వ్యాజ్యమాడితే నేనూ వ్యాజ్యమాడతాను. మిమ్మల్ని సాక్ష్యం వేసుకుంటాను. నేను బీదవాణ్ణి మీతో పంతం పట్టటం మంచిదికాదు. ఆఖరికి జోలైనా వేసుకు బైలుదేరుతాగాని భూమిమాత్రం సూటల్లో వదలిపెట్టను."

బ్రాహ్మడు కోపంతో వెళ్ళబోవటం చూచి కాశీనాథుడు చెయ్యిపట్టుకొని "నేను ప్రయత్నించి చూస్తాను. మీరు తొందర పడబోకండి" అని చెప్పాడు.

బ్రాహ్మడు వెళ్ళిపోయిన తర్వాత కాశీనాథుడు విజయబాబును పిల్చి - "ఆ భూమి మనదికాదు. వ్యర్థంగా ఆబ్రాహ్మణ్ణి ఏడిపిస్తారెందుకు?" అన్నాడు.

"అమ్మగారి అనుజ్ఞ."

"అమ్మగారు పరాయివాళ్ళ సొమ్మును అపహరించటం నేర్పిందా?"

"అది మనభూమి."

"కాదు. మనది కాదు."

విజయబాబు కొంచెంసేపు మాట్లాడక మళ్లాఅన్నాడు. "నేను నౌకర్ని. యజమాని ఎలాచెబితే అలా చేస్తాను."

ఈమాట కమలకు చెప్పటానికి కాశీనాథునికి సిగ్గుగా వుంది. అయినా ఆపుకోలేకపోయాడు. "ఆ భూమి నీదికాదు బ్రాహ్మణుని ఆ స్తిని అపహరించటం భావ్యంగాదు.

'అపహరిస్తున్నానని ఎవరన్నారు?'

"ఎవరంటే యేం? ఆ భూమిమాత్రం నీదికాదు. ఆ అన్యాయపు వ్యాజ్యం వేయవద్దని విజయబాబుతో చెప్పు."

"విజయబాబు అంతా తెలిసినవాడు, కార్యశూరుడు అనవసరంగా మీరు వారిపనిలో జోక్యం కల్పించుకోడం మాత్రం మంచిదికాదు" అన్నది కమల కోపంతో.

కొన్నిరోజులకు వాజ్యం ఫైసలయింది. కాశీనాథుడు కోర్టువారి ఎదుట బోనులో నిలబడి "నేను మా మామ ప్రియ బాబు జీవించివుండగా కూడా ఈ జమీందారీ వ్యవహారాలు చూచాను. తర్వాత చాలాకాలం వరకూ కూడా నేనే సంబా ళించాను. సదరుభూమి కమలాదేవిది కాదని మాత్రం నాకు బాగా తెలుసు'' అని సాక్ష్యమిచ్చాడు.

వ్యాజ్యం ఓడిపోయిన విజయబాబు వాడిపోయిన మొహంతో ఇంటికి వచ్చాడు. ప్రతివాదికూడా రెండు చేతులూ ఎత్తి కాశీనాథుణ్ణి ఆశీర్వదించి ఇంటికి వెళ్ళి పోయాడు.

౬

పరదాముందు నిలబడి విజయబాబు వ్యాజ్యాన్ని గురించి విశదపరచి ఆఖరికి తన టీకా టిప్పణిచేస్తూ, తన అభి ప్రాయాన్నిస్తూ "బాబుగారి మూలాన్నే మనవ్యాజ్యం ఓడి పోయింది" అన్నాడు. దీనిమీదట లోపల వున్న కమల హృదయోద్వేగంతో చాలసేపు మౌనంగవుండి "మీరు ఒకసారి లోపలికిరండి - ఇంకా చాలావిషయాలు మాట్లా డాలి.'' అన్నది. విజయబాబు లోపలకెళ్ళాడు. చాల సేపు

ఇద్దరూ రహస్యంగా మాట్లాడుకున్నారు. తర్వాత విజయ బాబు బయటికి వచ్చాడు.

చాలరోజులకి ఇవ్వాళ కాశీనాథుడు భోజనం చేస్తూ వుండగా కమల వచ్చి కూర్చుంది. ఇప్పుడు ఆ ఉగ్రరూపం లేదు. కొంచెం సేపైన తర్వాత కమల "కుటుంబద్రోహి విభీషణునివలన సువర్ణలంక భస్మమై పోయింది - ఎరుగున్నారా?" అన్నది. "ఆఁ! ఎరుగున్నాను"— కాశీనాథుడు తింటూనే సమాధానమిచ్చాడు.

"ఎందుకు తెలియదు, అతనూ పరభోజనముతో పెరిగినవాడేగా?" అన్నది కమల.

కాశీనాథుడు జవాబేమీ చెప్పలేదు.

కమల కొంచెంసేపు మెదలకుండా వుండి "ఇంత వరకు పరులు సొమ్ముతిని పెద్దవాడైనవానికి, ఇప్పుడు కూడా వారు దయతలచందే నోటి దగ్గరకు ముద్ద రానివారికి నిజం చెప్పవలసిన అవసర మేముందో? ఇంత అహంకారం ఏమి చూసుకునో?" అన్నది.

"కసాయివాడు కూడా సొమ్ముతిన్నవాళ్ల రొమ్ము గుద్దడు" అన్నది మళ్లా.

"కమలా!"

"భార్యసొమ్ము తింటూ బతికేవాడికి ఇంతఅదిరిపాటు పనికిరాదు. రోజురోజుకీ మీ వ్యవహారం చూస్తుంటే ......"

"ఇంటోంచి బైటికి గెంటిస్తావా?" - కాశీనాథుడు నవ్వుతూ అన్నాడు.

"ఆఁ! గెంటిస్తాను."

సగం తిన్న పళ్లెం అవతలకు దూరంగాతోసి ఆకమల మొహంకేసి తదేకదృష్టితో చూస్తూ "కమలా! ఇంతకు ముందెప్పుడు నాకు నీమీద కోపంరాలేదు. ఇంతకుముందు నిన్నెప్పుడు నోరెత్తి ఏమాట అనలేదు. ఇంతకు ముందెప్పుడు ఇటువంటి మాట - ఇప్పుడు నీవన్నటువంటి మాట - ఎవరూ అని వుండలేదు. దీనివల్ల నీకు కలిగే సుఖమేమైనవుంటే - ఇవ్వాళ్లనుంచి ఇక మీయింటి ముద్ద నోట పెట్టను" అని కాశీనాథుడు లేచి నిలబడ్డాడు. కమల కూడా సగర్వంగా లేచి నిలబడి - "నువ్వు సత్యవాదివైతే - మానవుడివైతే - నీ ప్రతిజ్ఞను పాలించుకుంటావు" అన్నది.

'ఆ! తప్పకుండా పాలించుకొంటాను. కాని నీ వన్న మాట నీకు చిర శత్రువై వుంటుంది. నేను నిన్ను క్షమించాను. కాని సర్వేశ్వరుడు నిన్ను క్షమిస్తాడా?'

"ఇటువంటి శాపాలు నన్నేం చెయ్యలేవు." అంటూ మరీ మండి పోయింది కమల.

"నేను నిన్ను శపించలేదు. ధర్మబుద్ధి గలిగివుండి సుఖపడమని ఆశీర్వదిస్తున్నాను."

బైటికి వచ్చి కాశీనాథుడు తన సద్ గ్రంథాలన్నిటినీ -వ్యాకరణ, సాహిత్య, దర్శన స్మృతి గ్రంథాల - సన్నిటినీ -ఒక్కొక్కటే చింపి పారేశాడు. నౌకర్లను పిచ్చి తనకున్నది కాస్తా పంచి పెట్టాడు. తర్వాత రాత్రికి కమలగది దగ్గర కెళ్ళి - తలుపుతట్టి పిల్చాడు "కమలా! కమలా!" అని కమల మేలుకొంది కాని పలుకలేదు. తలుపు తీసేవుంది - కాశీనాథు తలుపు తీసుకొని లోపలికెళ్ళి చూచాడు.—

కమల కళ్ళుమూసుకొని మంచంమీద పండుకొని వుంది. మంచంమీదకెళ్లి కూర్చుని తల నిమురుతూ "కమలా" అని పిల్చాడు కాశీనాథుడు. కాని సమాధాన మేమీరాలేదు. లేచి వెళ్ళుతూ "నిన్ను ఆశీర్వదించి పోతున్నాను" అని మెదలకుండా బైటికి వెళ్లిపోయాడు.

కాశీనాథుడు వెళ్లిపోయిన తర్వాత కమల ప్రక్క మీద నుండి లేచి కిటికీదగ్గరకెళ్లి కూర్చుంది. ఆమె కూర్చుని వుండగానే తెల్లవారటం చూచి మళ్లావెళ్లి పక్క మీద పండుకున్నది. మెలుకువ వచ్చి కన్ను తెరచి చూచే టప్పటికి చాల ప్రొద్దెక్కింది. ఇల్లంతా గల్లంతుగా ఉంది. కమల యింకా బాగా మేలుకోకముందే దాసీది "ఎంతటి పని జరిగింది. అమ్మగారు? బాబుగారిని ఎవరో ఖూనీచేచారు" అని అరుస్తూ పరుగెత్తుకొచ్చింది. కాగుతున్న నూనెలో నీటిబొట్టులాగ తడబడుతూ కమల లేచివచ్చి "ఖూనీ?" వ్యాకులంతో అన్నది.

"అవును! ఖూనీ" - ఎవరో సమాధాన మిచ్చారు. కమల ఒక విధంగా వస్త్రహీన దశలోనే బైట గదిలోకి పరుగెత్తుకొచ్చి చూచింది: కాశీనాథుడు స్మృతితప్పి సోఫా మీద పడివున్నాడు. ఒళ్ళంతా-రక్తం, దుమ్మూ పేరుకుపో యింది. ముక్కుల్లోంచి, నోట్లోంచి వచ్చిన రక్తం ఎక్కడ దక్కడేఎండిపోయింది. కమలఅరుస్తూ తెలివితప్పి పడిపోయింది.

"జమీందారుగారి అల్లుడు అర్ధరాత్రివేళ ఎక్కడికో వెళ్ళుతూంటే దారిలో ఎవరో ఖూనీచేశా" రన్న వార్త ఊరంతా పాకిపోయింది.

రెండు రోజులతర్వాత, కాశీనాథునికి తెలివిరాగానే - "మిమ్మల్ని ఈ విధంగా చేసింది ఎవరు?" - పోలీసు యిన్స్పెక్టరు అడిగాడు.

"వాడు" కాశీనాథుడు ప్రైవంక చూపించి అన్నాడు.

"వాళ్లని మీరు గుర్తించలేదా?" - మళ్ళా అడిగాడు

"గుర్తించాను-" కాశీనాథుడు అస్పష్టస్వరంతో అన్నాడు.

"వాళ్ళు ఎవరు?" - ఇన్స్పెక్టరు మరింత వ్యాకుల స్వరంతో అడిగాడు.

కాశీనాథుడు కొంచెం మౌనంగా వుండి- "నే నే పొర పడ్డాను - వాళ్ళని గుర్తించలేదు" అన్నాడు.

ఇన్స్పెక్టరు మళ్లా రెండు మూడు సార్లు అడిగాడు. కాని లాభం లేక పోయింది. కాశీనాథుడు ఏమీ చెప్ప లేదు. మర్నాడు దివానుని పిలిచి "బిందువాసినిని చూడాలని వుంది. ఎవరినైనా వైద్యనాథ్ పంపించి ఆమెను తీసుకురమ్మని చెప్పండి" అన్నాడు.

మూడురోజులకి బిందువాసిని, యోగేశ బాబు వచ్చారు. బిందు కొంచెం నిబ్బరంగల మనిషి, కాశీనాథుణ్ణి చూడగనే ఆమె కమలలాగ ఆతురత పడనూ లేదు, తెలివితప్పి పడిపోనూ లేదు. కళ్ళనీళ్ళుమాత్రం తుడుచు కుంటూ — "ఇంతటి పనికి ఒడికట్టింది ఎవరు బావా?" అన్నది.

"ఏమో, ఎట్లా తెలుసు"?

"నీకు ఎవరిమీదైనా అనుమానముందా?"

"ఆవిషయం అడగకు, బిందూ !"

బిందు మెదలకుండా కాశీనాథుని మోహంకేసిచూస్తు వుండిపోయింది.

ఆ గాయం నయమయి కాశీనాథుడు బతుకుతాడని ఎవరికీ నమ్మకంలేదు. అవసానకాలం సమీపిస్తోంది. కాశీనాథుడు జ్వరప్రకోపంవల్ల పిచ్చిమాట లాడుతూ "చెప్పు కమలా, ఇది నీపనికాదుగదా!" అన్నాడు.

బిందు బావమొహందగ్గర మొహంపెట్టి అడిగింది — "ఏమిటి అంటున్నావు బావా?"

## ౧౦

మూర్ఛస్థితిలోనే కమల రెండురోజులు గడిపింది. డాక్టరు చెప్పినట్టు దాసదాసీలు చాల జాగ్రత్తగా ఆమెచుట్టూ కూర్చొని వున్నారు. రెండురోజుల నుంచి చేసిన ప్రయత్నంవల్లా సేవాశుశ్రూషలవల్లా ఆమెకు కొంచెం తెలివి వచ్చింది. లేచి కూర్చోబెట్టారు.

బాగా కళ్ళుతెరచి చూచేటప్పటికి ఇప్పటిదాకా తన తలను ఒళ్ళోపెట్టుకు కూర్చున్న వ్యక్తి తనకు అపరిచితురాలుగా కనబడింది.

"నువ్వు ఎవరవు?"

"నేను బిందును – మీ భర్తకి మేనమామ కూతుర్ని" అన్నది అపరిచితవ్యక్తి.

కమల చాలసేపటి వరకు ఆమె మొహంకేసి చూచి- అందరినీ బైటికి వెళ్లిపొమ్మని సైగచేసి చెప్పింది. "నేనెంత సేపటినుంచి ఈ స్థితిలోవున్నాను?" ...మెల్లగా అన్నది.

"మొన్న ప్రొద్దున తెలివితప్పి పడిపోయావు అక్కా! తర్వాత ఇంతవరకు తెలివిరాలేదు" అన్నది బిందు.

"మొన్న! - కమల చకితురాలై పోయింది. తర్వాత తలొంచుకొని నిస్సబ్దతలో కూర్చున్నది. చాల సేపటివరకు ఆమె అదేస్థితిలో వుండేప్పటికి బిందు అనుమానంతో చేయి పట్టుకుచూచి - "అక్కా" అని పిలిచింది.

"భయపడకమ్మా, నేనిప్పుడు తెలివిలోనే వున్నాను." అన్నది కమల తల ఎత్తకుండానే.

ఆమె తెలివి తెచ్చుకోటానికి ప్రయత్నిస్తోందని బిందు తెలుసుకొని ధైర్యంతో కూర్చుంది. కొంచెంసేపు అలాగే కూర్చున్న తర్వాత కమల మాట్లాడటం మొదలు పెట్టింది. "నన్ను పెట్టుకుని రెండు రోజులనుంచీ ఇట్లాగే కూర్చున్నావా బిందూ? నాకు సేవచెయ్యాలని నీకెలాబుద్ధిపుట్టింది? నేనెప్పుడూ అటువంటి ఉపచారాలు చేయలేకపోయాను."

బిందు ఆమె మాటలుసరిగా తెలుసుకోలేకపోయింది. "ఎందుకు బుద్ధిపుట్టదు అక్కా? నువ్వేమీ పరాయిదానివి కాదుగదా! మాతో పరిచయం లేదుగాని, బావలాగ నువ్వూ - మాదానివే. నీ శుశ్రూష చెయ్యటం కూడా నా కర్తవ్యమేగదా? నీకు తెలియదుగాని నేను వచ్చినదగ్గర నుంచి - ఈరెండు రోజులు ఎలాగడచినాయో భగవంతుడికే తెలుసు " ఒకసారి బావగదిలోకి ఒకసారి నీగదిలోకి, బావ దగ్గరకెళితే నీకెలావుందని ఆతురత, నీదగ్గరకువస్తే బావకెలా వుందని భయం - ఇలా గడిచినయి ఈ రెండు రోజులు. ఇవ్వాళ బావకి కొంచెం వీలుచిక్కి విశ్రాంతిగా నిద్రపోవటం

చూచి, నీదగ్గరకొచ్చి తీరిగ్గా కూర్చోగలిగాను. బావస్థితి చూచి బతుకుతాడని ఎవరన్నా అనుకున్నారా !"

"ఇక పరవాలేదా ?"— కమల అడిగింది.

బిందు తలవూపుతూ "ఇంకేం పర్వాలేదు. జ్వరం కూడా తగ్గింది. ఇక భయపడాల్సిన అవసరము లేదని డాక్టరు చెప్పి పోయాడు" అన్నది.

కమల మొహం ఒక్కసారి కళకళలాడి మళ్లీ మృత శరీరంలాగ వివర్ణమైంది. వణుకుతున్న శరీరంతో మళ్ళా తెలివి తప్పి బిందు ఒడిలో పడిపోయింది.

బిందు ఆతురతపడి గల్లంతు చేస్తూ ఎవరినీపిలువలేదు. ఆమె తల తన ఒళ్ళో పెట్టుకొని విసనకర్రతో మెల్లగా విసర సాగింది. ఈస్త్రీలో స్వాభావికమైన ధైర్యం ఎంతవున్నదీ-ఆమె భర్తకు జబ్బువచ్చినప్పుడే తెలిసిపోయింది. మృత్యుదేవతవచ్చి ఆమెభర్త మంచంమీద కూర్చున్నప్పుడుకూడా కించత్తయినా చలించలేదు. ఇప్పుడు బిందు కమలకొరకు ఎందుకుభయ పడుతుంది ? కొంచెం సేపటికి తెలివి వచ్చి కమల కళ్ళు తెరచి తనెక్కడున్నదీ చూసింది. తర్వాత బిందు ఒళ్ళో మొహంపెట్టి వెక్కి వెక్కి ఏడవ సాగింది.

ఆ గాఢాక్రందన బిందు ఒడిలోనే ఎండి పేరుకు పోసాగింది. దానిలోని ఒక్కతరంకూడా బైటకొచ్చి ఎవరి చెవినీ పడలేదు. బైట నిర్జనాంధకారం నిశ్శబ్దంగా గాఢం కాసాగింది. లోపల ఒక తరుణి విదీర్ణమైన తన హృదయ జ్వాలలను మరొక శాంతిమూర్తి ఒడిలో మెదలకుండా గ్రుమ్మరిస్తోంది.

క్రమంగా శాంతించి కమల తన భర్తనుగురించి చాలా విషయాలడిగింది. కాని ఆమె స్వయంగావెళ్ళి అతన్నిచూచి వద్దామన్న కోర్కెను ఎందుకు బైటపెట్టలేదో అనేక విధాల ఆలోచించినా కూడా బిందుకు అర్థంకాలేదు. ఆమె పెద్ద యిళ్ళల్లో పొందే శిక్షా సంస్కారము ఇదేమో నని కూడా అనుమానపడింది. ఉపచర్యలభార మంతా నౌకర్లమీదపెట్టి బైటనుండి కబుర్లు తెలుసుకోటమే వారి నియమమనుకుంది. "సరేగాని బిందూ మీబావకు తెలివి వచ్చినతర్వాత నన్నుగురించి ఏమైన అడిగారా!" కమల ఒక్కసారి అడిగింది.

"ఒకసారి అడిగాడు" అని బిందు తటాలున ఆగి పోయింది. కమల ఇది గుర్తించింది. కాని ఏమీ ప్రశ్నించక కేవలం ఉత్సుకత్వంలో బాటు వ్యాకుల దృష్టితో బిందు మొహంకేసి చూస్తూ వుండిపోయింది.

బిందు కొంచెంసేపు మెదలకుండా వుండి అన్నది "తెలివివచ్చిన తర్వాత బావ నన్ను నువ్వనుకొని—చెయ్యి గట్టిగా పట్టుకొని—"చెప్పు కమలా! ఈ పని నువ్వు చేసింది కాదుగదా? నేనుచచ్చికూడ సుఖపడలేను కమలా. ఈ పని నీద్వారా జరగలేదని ఒక్కసారి చెప్పు" అని అడిగాడు.

"తర్వాత?-" కమల నిట్టూర్పును ఆపుకుని అన్నది.

"బావ దేనిని గురించి అడిగాడో నాకు తెలియదు అక్కా" అన్నది బిందు.

"వారు ఏమి తెలుసుకోవాలంటున్నారో నాకు తెలుసు బిందూ" అని కమల ఒక్కసారి లేచి కూర్చుంది.

బిందు కమలచేయి పట్టుకుని-"నువ్వు ఆగదిలోకి వెళ్ళవద్దు అక్కా!" అన్నది.

"ఏం, ఎందుకు వెళ్ళవద్దు?"

"నువ్వు వెళ్ళితే ప్రమాదం కలుగుతుందని డాక్టరు చెప్పాడు"

"నా ప్రమాదం. నాకంటే డాక్టరుకి ఎక్కువ తెలియదు బిందూ! నేను వారిదగ్గర కెళతాను. తెలివివచ్చిన తర్వాతకూడా వారు ఇంకేమైనా తెలుసుకోవాలంటే దానికి సమాధానం నేనే చెప్పాలి" అని కమల బిందుచేయి తన చేతిలోకి తీసుకొని వినయంగా అన్నది. "జీవితపర్యంతం నేను తల తిన్నగా ఎత్తుకు తిరగలేను. దయయుంచి నన్నొకసారి అక్కడికి పంపు బిందూ!"

తర్వాత మనసులో - భగవంతుడా! నా పసుపు కుంకుమ ఇంతవరకు నిలిపినవాడివి నీవైతే-ఇప్పుడు న్యాయాన్యాయాలు నిర్ణయించి దాన్ని అపహరించకు! నాశిక్ష ఇంకా ఎక్కడ పూర్తయింది? ఇంకా చాలావుంది. నీవు విధించిన కఠినదండన సంతోషముతో స్వీకరించటానికి ఆ కాస్తదారీ తొలగించకు, మహాప్రభూ! అన్నది.

భర్తవున్నగదిలోకి వెళ్ళగానే కమల స్థిరంగా వుండలేకపోయింది. రెండురోజుల్నించి ఉపవాసంవున్న ఆమె శరీరం అంతకన్నా ఎక్కువ బలహీనమై యున్నందున గిర్రున తిరిగి భర్త పాదాలమీద పడింది.

మేలుకొనివున్న కాశీనాథుడికి తన పాదాల దగ్గర ఎవరో పడినట్టు తోచింది. కాని తలెత్తి చూటానికి అతనికి శక్తి లేక పోయింది. "ఎవరు ? బిందూ!" పడివుండే అడిగాడు.

"కాదు. అక్క" - బిందు అన్నది.

"కమలా ! నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు"

బిందు తల వైపున కూర్చుని " ఇక్కడికి వచ్చి తమాయించుకో లేక పడిపోయింది" అన్నది మృదుస్వరంతో.

కాశీనాథుడు మెదలకుండా వుండిపోయాడు.

"నేను ఇవ్వాళ ఇక్కడికి రావద్దన్నాను. రెండు రోజులనుండి మూసినకన్ను తెరవకుండా పడివుంది. యిక్కడికి వస్తే తమాయించుకో లేదని నాకు తెలుసు" అన్నది బిందు.

కమల భర్త పాదాలదగ్గర అలాగే పడివుంది చల్లని పాదాల మీద వేడికన్నీటిధారలు పడుతున్నట్లు తోచింది. కాశీనాథుడికి. "అవును బిందూ ఇవ్వాళ ఇక్కడికి రాకుండా వుంటే బాగుండేది" అన్నాడు.

కమలకేసి చూస్తూ చూస్తూ బిందుకి కళ్ళలో నీళ్లు తిరిగాయి. "బాగుండేదే కాని అలా వుండగలమా ఈ రెండు రోజులూ అక్కడ ఎలా గడిచినాయో నాకు తెలుసు. తర్వాత ఆ భగవంతునికి తెలుసు. స్వయంగా ఆమెక్కూడా ఈ విషయం తెలియదు" అన్నది కన్నీళ్లు తుడుచుకుంటూ.

భగవంతుని పేరుతో కాశీనాథుడు కళ్లు మూసుకుని తన బాహ్యదృష్టిని నిమిషమాత్రం లోపలికి - విశ్వమానవ కోటి అంతా అంతర్యామితో చిరఐక్యత పొందేచోటికి —

పోనిచ్చి తన ప్రశ్నకు సమాధానంకోసం ప్రతీక్షించాడు. తర్వాత కళ్లుతెరచి – "ఇప్పుడు నా ప్రాణానికేమీ ప్రమాదం లేదు. లేచికూర్చో, కమలా" అన్నాడు.

"నువ్వు నన్నడిగిన విషయానికి సమాధానం చెప్పటానికి వచ్చింది అక్క" – అన్నది బిందు.

కాశీనాథుని పెదవులమీద చిరునవ్వురేఖలు ఆవరించాయి. "ఇప్పుడు ఎవరూ ఏసమాధానం చెప్పనవసరంలేదు. బిందు ఈ రెండు రోజులనుంచీ స్పృహతప్పి పడివుండటమే నాకు సరైన సమాధానం" అని ఎడంచేయి వూతం చేసుకుని లేచి కూర్చున్నాడు. మళ్లా కుడిచేత్తో కమలను లేవదీయటానికి ప్రయత్నిస్తూ – "కమలా" అన్నాడు.

కమల సమాధానమేమీ యివ్వలేదు. అతని పాదాల వద్దపడి అలాగే కన్నీరు కారుస్తోంది.

"నువ్వు లేవుబోకుబావా, డాక్టరుకూడా చెప్పిపోయాడు. మళ్లీ ......" అన్నది బిందు.

"డాక్టరు ఏమైనా చెప్పనీ, ఇక భయపడ వలసిన అవసరమేమీ లేదు. ఈ ఆపద నుంచి నన్ను కాపాడింది మీరు" అన్నాడు కాశీనాథుడు చిరునవ్వుతో.

తర్వాత కాశీనాథుడు రేగిన కమల కురులను తనచేత్తో కొద్దిసేపు అటూ ఇటూ నిమురుతూవుండి; పండుకొన్నాడు.

— ♦ —



శరత్‌బాబు తెలుగువాడేమోనని అనేకమంది భ్రమ పడుతూ వుంటారు. దానికి కారణం లేకపోలేదు. అతను సృష్టించిన పాత్రలు, కల్పించిన వాతావరణం తమకు సరిపోలుతున్నపుడు తెలుగువారే కాదు ప్రతి భారతీయుడూ అలా భ్రమ పడక తప్పదు. నిజంగా అలా భ్రమ కలిగించినవాడే యదార్థమైన కవీ, కళాకారుడూను. కాని శరత్‌బాబు తెలుగువాడు మాత్రం కాదు. బెంగాలీయుడు. బెంగాలీ భాషలోనే రచనలు చేశాడు. అయినా భారతీయ సాహిత్యంలోనే కాక, ప్రపంచ సాహిత్యంలో గణన కెక్కాడు. పుట్టింది 1876 వ సంవత్సరంలో అతి పేదకుటుంబములో హుగ్లీజిల్లా దేవానందపూర్ అనే కుగ్రామములో. కొంతకాలం జన్మస్థలంలోనూ, మరి కొన్నాళ్ళు భాగల్పూర్‌లో మేనమామల ఇంటివద్దా విద్యాభ్యాసం చేశాడు. అంతకు మించి అతని జీవితానుభవమే కొంత శిక్ష. అతనికి కొద్దివయస్సప్పుడే తల్లిదండ్రులు గతించారు. జీవన భృతికోసం వుద్యోగాన్వేషణ చేయసాగాడు. చివరకు రంగూన్ కూడా వెళ్లాడు. అక్కడే పదేళ్లు దాదాపు వుద్యోగం చేశాడు. అక్కడ వుద్యోగంలో వుంటూనే రచనలు చేస్తూవుండేవాడు. అప్పటికి రచయితగా పేరుప్రఖ్యాతులు వచ్చాయి. ఆరోగ్యం చెడటంవల్ల స్వదేశానికి మరలి వచ్చాడు. మళ్ళీ వెళ్లలేదు. అప్పటినుండి జీవితాంతంవరకు సాహిత్యారాధనే జీవనోపాధి అయింది. చాల నవలలు, కథలు వ్రాశాడు. దాదాపు అన్నీ తెలుగులోకి వచ్చాయి. 1938 లో పరమపదించాడు.